ఓమ్

సరస్వత్యై నమః

# కుమారస్వామి విజయము

(కాళిదాసు)

Acc. No. 17676



చర్ల గణపతిశాస్త్రి

# విషయసూచిక

6 వ సర్గ



7 వ సర్గ



8 వ సర్గ



9 వ సర్గ



— o —

# కుమారస్వామి జయము

## దేవ గురు నమస్కృతి

తొలినారాయణుఁ డాత్మరూపమున నెందున్ క్షీరమట్లొప్పి, లీ
లలకై ఆపయి పాలమీఁగడయటుల్ వ్యక్తాకృతిన్ జెంది, ని
ర్మలమాకాశము, నందుగాలి, జ్వలనంబాపై నటన్ నీరు, నం
దిల, యన్నంబయి జీవియై వెలుఁగు, నా యీశున్ సదామ్రొక్కెదన్. 1

బ్రహ్మముఖంబునం దమృతవాహినియై విశదంబునొంది ఆ
బ్రహ్మఋషి ప్రశాంత విమలాశ్రమవాటి మెలంగి సత్కవి
బ్రహ్మల మోముఁదమ్ముల సరస్సులలో రసకేళిఁదేలు నా
బ్రాహ్మి మదార్యసూక్తి రసపావనియై విహరించుఁ గావుతన్. 2

తీయని కైతమావినునుఁ దిన్నని కొమ్మను గూరుచుండి క్రొం
దీయని గొంతుతోఁ జివురుఁ దీయము లూరఁగ రామ రామ రా
మాయని యక్షరామృతము లానుచు నయ్యమృతంబు లిచ్చురా
మాయణగాత వాల్మికి మహాకవికోయిలఁ బ్రస్తుతించెదన్. 3

వైదిక సంహితాటవుల బాటలు దీరిచి యజ్ఞశాలలన్
వేదిక లాశ్రమా లమృతవీధులు చక్కఁగ దిద్ది యందులోఁ
బాదములుంచలేని జనపాళికి మేడలు పూవుఁదోట ల
ష్టాదశరీతి నంతరులు సల్పిన శిల్పిని వ్యాసు నెంచెదన్. 4

శ్రీ నారాయణశాస్త్రి వి
జ్ఞాన ధురీణుని ననేక శాస్త్రజ్ఞుఁ గవీ
శానుని జనకుగురుఁ దలఁచి ;
యాననఁగ కుమార సంభవాబ్ధి మథింతున్. 5

తీయనితేనె లాని రుచితీయని సుంతయు జాఱకుండఁ గ్రొం
దీయనిపూవుఁ దేనియలు తెచ్చి యొసంగెడు తేఁటివోలె నే
నీయెడఁ గాళిదాసుకవీజుని వాగమృతంబు గ్రోలి యా
తీయన సుంతయుం జెడనితీరున నీయఁగ సాహసించితిన్. 6

ఎంద జెందఁగా యిది మథియించి రసము
మనము మాత్రము మది నూరకొనుట యేల
అంతలంతలు యత్నంబు లాచరింపఁ
దుదకు నందఱ కమృతంబు దొరకె నొక్కొ. 7

## హిమాలయునివర్ణన

ఉత్తరపు దిక్కున హిమాలయుండనంగ
దేవతామూర్తి యొక పర్వతేశుఁడుండె
అతఁడు దిగి తూర్పు పడమరయబ్ధులందు
భూమి కొలిచెడి కొలకఱ్ఱవోలె నుండె' 8

అతనిన్ దూడగఁజేసి కౌశలముతో నల్లల్లనన్ దక్షతన్
బితుకన్—మేరువుగొల్లకాఁగ—పృథుపృథ్వీశుండు బోధింప స
న్మతి గోరూపము దాల్చు నీవసుమతిన్ భాసించు రత్నాల్ రసో
చితమౌ నోషధులన్ నగాళి పిదికించెన్ లోకముల్ భేషనన్ 9

ఘనమగు ననంతరత్నముల్ గనుచు నుండు
నద్రి సౌభాగ్యమును మంచు నణఁచలేదు
గుణ గణములోన నొకె దోషమణఁగి పోవు
అచ్ఛమగు చంద్రకిరణాల—మచ్చవోలె" 10

అప్సరల కొయారంపు భూషాదికములఁ
గూర్చిపెట్టుచు మబ్బుల కొసల-విడిన
రంగులం జిత్రమై యకాలంపు సంధ్య
వోలె జాళ్లరం గతఁడు శృంగాలఁ దాల్చు॥ 11

నడుమ గిరిమేఖల వఱకు నడచుమబ్బు
క్రింది చఱియలఁగలనీడ లందు నిలిచి
వానలకుఁ గుందు సిద్ధదంపతులు, వీని
యెండగల శృంగముల నాశ్రయించు మంద్రు॥ 12

మంచుసోనలు రక్తవుం బదవి కడుగ-
గజములం బంపు సింహాల కాలిగుర్తు-
లందగపడకున్నను గోళ్లసందునుండి
రాలు ముత్యాలె తెలుపుఁ గిరాత తతికి॥ 13

ఏనుఁగుల మేనిపొడలట్టు లెఱ్ఱనగుచు
రకరకపుధాతురసపు వర్ణములఁ బొలుచు
భూర్జపత్రాలు, ప్రేమజాబుల సుకృత్యా
మిందుఁ దీర్చు విద్యాధర సుందరులకు॥ 14

కందరముఖాల వెడలెడు గాలిచేత
బొంగువెదురుల రంధ్రాల మొదటు నూది
స్వాచ్ఛగాంధార 1* గ్రామంపుటుచ్చ శ్రుతులఁ
గిన్నరులకు 2*తానమిడు లా గితఁడు వఱలు॥ 15

గండముల దురదలు పోవ గజము లవటు
రాచికొన, దేవదారు చర్మంబులూడి
పాలుగారు, నాపాలలో బయలుదేఱు
వాసనలు గ్రమ్మఁ బఱియలు పరిమళించు॥ 16

అనుఁగు ప్రియలతో విహరించు వనచరులకు
గుహల యిండ్లలోపలఁ గాంతి గ్రుమ్మరించు

---

1* 1. షడ్జ 2. మధ్యమ 3. గాంధారగ్రామములు (=స్వరసమూహము) అని గ్రామములు మూఁడు. అందు షడ్జ మధ్యమ గ్రామములను మనుష్యులు పాడఁగలరు, గాంధార గ్రామమును దేవతలు మాత్రమే పాడఁగలరు.

2* తానము=స్వరరాగములను దీర్ఘముగా మనోరంజనముగాఁ బాడుట.

నోషధులు నూనెలేని దీపోత్సవములు
రాత్రిఁ గావించుచుండు నక్రాంత మచట॥ 17

గడ్డకట్టిన నునుమంచు గప్పి, దారి
నంగుళుల కీళ్లు ప్రేల్చుచున్నప్పటికిని
నడిమి - క్రింది - పై - భాగంబులఁ గఁ ద్రొక్క
విడరు కిన్నరస్త్రీల్ వెండ్లినడక లచట॥ 18

పవలు భీతిచే గుహలలోఁ బడియుదాగు
కటిక చీఁకట్ల రవినుండి గాచు నతఁడు
సత్యముగ క్షుద్రుఁడైనను శరణుపొంద
మహితులకు నార్యులందట్లు మమతయుండు॥ .9

ఇటునటులు తోక లాడించి యెంతొయలరి
చంద్ర కరగౌరమగు వాలచామరములు
వైచి చమరీ మృగంబులు పర్వతేశుఁ
డను పదంబద్రి కొనరించు సార్థకముగ॥ 20

వలువలను ప్రియుల్ లాగ సిగ్గిలుచునున్న
కిన్నరాంగనలకు దైవకేళి నతఁడు
గుహల గృహములద్వారాలఁ గూడి వ్రేలు
దొంతరల మబ్బుల తెరలన్ సంతరించు॥ 21

లీల గంగాలహరి శీకరాలఁ దడిసి
యవలఁ బోరిఁబోరి దేవదారువులఁ గదిపి
నెమలి పింఛాలు విప్పియాక్రమత నచటి
యనిలము మృగాల వెదకుబోయలను గొలుచు॥ 22

సప్తఋషులు కరాలఁ ద్రుంచంగ మిగిలి
యగ్రసరసుల మొలచిన యంబుజములఁ
పైకి మొగమెత్తు కిరణాలఁ బఱపిలేపుఁ
గ్రిందఁ జరియించు సూర్యుఁ డాగిరిని మెసలి॥ 23

యజ్ఞవస్తులు, సోమలతాదులొసఁగి
ధాత్రి యెల్లఁదాల్చెడి శక్తిదనరు టరసి
యాతనికి యజ్ఞభాగంబు లేర్పరించి
ప్రాయముగ విధాత శైలాధిపత్యమొసఁగె॥ 24

## హిమాలయుఁడు మేనకను పెండ్లియాడుట

అట్టి మహానుభావ:బు గలవాఁడును మేరు గిరికి అనుఁగు సఖుఁడును నైన హిమవంతుఁడు వంశ మర్యాద లెఱింగిన వాఁడుగానఁ దనవంశమును నిల్పుటకై పితృదేవతల మనస్సంకల్పముచే నావిర్భవించినదియు మునులకుఁ గూడ మాననీయయునగు మేనకయను నొక కన్యను యథావిధిఁ బెండిలియాడెను. 25

## మేనకయందు మైనాకుఁడు పుట్టుట

విదపఁ గాలక్రమంబునఁ బ్రియులు వీరు
స్వాస్వసౌందర్య సౌభాగ్యవంతు లగుచుఁ
బ్రణయులై యుండ హృద్య యౌవనముఁదాల్చు
పర్వతపు రాజుపత్ని గర్భంబుదాల్చె 26

నాగసతులు భోగించు నందాల తనువు
నబ్ధియెడ బద్ధమైత్రియు నమరునొక్క
సుతుని మైనాకుఁగనెనామె; యతఁడొ ఱెక్క
లూడ్చు నింద్రువజ్రవు దెబ్బరుచిగనందు॥ 27

అటఁ గొంత కాలమునకు——

అటు పితయవమానింప యోగాగ్నియందుఁ
దనువు విడిరుద్రు తొలిపత్ని దక్షకన్య
యగు సతీదేవియీ జన్మమందు నట్టి
యద్రిరాజు భార్యకుఁ బుత్రియై జనించె॥ 28

వ చక్కఁగాఁ బ్రయోగించుటచేఁ జెడని నీతియందు ఉత్సాహ గుణమువలన సంపదవలె, నియమ నిష్ఠలుగలమేనకయందు పర్వత సార్వ

భౌముఁడగు హిమవంతునివలనఁ గళ్యాణియయిన యామె జనించెను. పుడు దిక్కులు ప్రసన్నములయ్యె. దుమ్ములేక గాలి హాయిగావీచెను. శంఖములు ధ్వనించెను. పుష్పవృష్టి కురిసెను ఇట్లు పర్వతరాజు కుమార్తె జననము స్థావర జంగమములైన సర్వశరీరులకు సుఖముగలిగించి విలసిల్లెను. 29

అవుడు——

పొలుచుద్యుతి పుంజమొప్పు నా పుత్త్రి చేత
ఆమె జనని మేనక యెంతొ యలరి వెలిఁగె
నల్ల మబ్బుల యుఱుముల వల్ల మెఱయు
మణి శలాకచే వైడూర్య మహివిధాన॥ 30

దిన దినము వర్ధమానమౌ తనువు నామె
ఉదయమొందు చంద్రునికళ యొప్పుతోఁప
వెన్నెలలలోన నణఁగిన భిన్నకళలఁ
బోలె లావణ్య మయ విశేషాలఁ బెంచె॥ 31

బంధువులకుఁ బ్రియురాలయిన యామెను బంధుజనులు పర్వతవంశ సంబంధమును పురస్కరించుకొని పార్వతియని పిలువఁ దొడఁగిరి. భర్తకై తపముచేయు కోరికగల యామెను ఉ=ఓసీ మా=(తపసు) వద్దు అని తల్లిదండ్రులు నిషేధించుటచేఁ దర్వాత ఆ సుముఖికి 'ఉమ' అనికూడ పేరు గలిగె. 32

అతని కెంతొ సంతతి కల్గినప్పటికిని
ఇతని దృష్టి యామె యెడ సంతృప్తిగనదు
ఎన్నొ పూలు వసంతుని కుండెనైన
భ్రమరపంక్తి మావిపయినె రక్తిచూపు॥ 33

పలుద్యుతుల శిఖలచేత దీపంబువోలె
త్రిపథగ యయిన గంగచేఁ ద్రిదివమట్లు
పూత సంస్కార వాక్కుచే బుధుఁడువోలె
ఈమెచేఁ దండ్రి, శుచి యలంకృతుఁడు నయ్యె॥ 34

గిరి బాల యొకవేళ సురనదీ తీరాల
నిసుకతిన్నె యరుగులెక్కి తిరుగు
మృదుపాణి యొకతఱి లేత యందపుఁ గేలు
కందు నట్టులు కందుకంబు లాడు
పద పద్మ యొకపరిఁ బదము లెఱుపు వాఱ
గిరి శృంగములనెక్కి పరువులెత్తు
పసిఁడి బొమ్మ యొకెడఁ బసిఁడి బొమ్మలు పెట్టి
గుజ్జన గూండ్లాడుఁ గూడి సఖుల

ఆప్త సఖురాండ్ర మధ్యాలో నన్నియెడల
మించు జలదాళి మధ్యాలో మెఱుపువోలె
బాల్యమున సంచరించుచు బాల మిగులఁ
గేళి రసము లనుభవించు లీల నుండె॥ 35

శరదృతువందు హంసములు చక్కఁగ గంగను జేరునట్లు, రా
తిరి సమయంబునందుఁ దమదీప్తులు నోషధిఁ బొందునట్లు, మున్
స్థిర ముపదేశముం గనిన చెల్వకు నేఁ డుపదేశవేళలన్
విరివిగఁ బూర్వజన్మమున నేర్చిన విద్యలు వచ్చి చేరెడిన్॥ 36

గాత్రలతకు సాజమౌ నలంకార సీమ
మద్య మనుపేరు పొందని మదపువేరు
పువ్వుకంటె వేఱయిన కాముని శరంబు
అయిన నవయౌవనము వచ్చి యామెఁ జేరె॥ 37

సరిగఁ గుంచెచే దిద్దు చిత్తరువువోలె
భాను కిరణాలచే విచ్చు పద్మముల
హెచ్చు తగ్గులులేక యా యింతిమేను
తిన్నగ యౌవనముచేత దిద్దఁబడియె॥ 38

అంతటను నెత్తయిన వ్రేళ్ళ కాంతికొనలు
బాగుగా నుంచుటన్ రాగ భంగిమలను

గ్రక్కుమన్నవి వలె నామె కాళ్ళు నేల
మెట్టితామర పువు శ్రీల మెఱఁగ జేసె 39

తిరుగ నుపదేశ మొందు నాతురతచేత
నందియల శింజితములు నేర్వం దలంచు
రాజహంసల వలన వినమ్రాంగి యపుడు
నడ లొయారాల శిక్షణ పడసె వేమొ॥ 40

క్రమమై గుండ్రనివై భ
ద్రములై యతి పొడుగుగాని తజ్జంఘలయం
దము తీర్చిన విధి, శేషాం
గములకు నందాలు గూర్పఁ గడఁగెనొ యేమో॥ 41

కరిపతి కరములు చర్మము
గలుకొట, ననంటి చెట్లొకటె చలివొటన్
ధరలో విశాలరూపము
పరఁగియు, నుమతొడలఁ బోల బాహ్యంబులెఱగా. 42

అతివ తెవరికిఁ గోరఁగనైనఁ గోరఁ
గనని హరునోడి నవల నెక్కంగఁ గనుట
అనఘ యాయుమ మొలనూలు నునుచు చోటు
చెలువ మింతది యని దీనఁ దలఁప వలయు॥ 43

వలువముడి దాటి లోతు పొక్కిలిని సరిగ
చేరి సన్నని క్రొత్త నూగారు వరుస
యుమకు ఖాసిల్లె. మొల నూలి నమరునడిమి
యుంద్రనీల మణి రుచుల యేఱు వోలె॥ 44

అరఁగువలె సన్ననై యందమైన నడుము
గలుగు గిరిరాజసుత మూఁడు వళులు వెలసె
అమ్మరుండెక్కుటకు నవ యౌవనంబు
మేల్మి బంగారుతోఁ దీర్చు మెట్లువోలె॥ 45

ఒక టొకటి రాసికొనుచు నీలోత్పలాక్షి
తెల్లనైన చందోయి వర్తిల్లె నిటులు
ఎటులు నల్లని మొగముతో నెనయు వీని
నడుమఁ దౌవతూడు నూలుకేన్ స్థలము గనమొ. 46

ఛిరిసెన పువు కంటెఁ గడున్
గిరిసుత బాహులు మృదువని నే భావింతున్
స్మరుఁడు పరాజితుఁ డయ్యును
హరునికి గళపాశములుగ నవు డివె చేసెన్. 47

స్తనముల బిగువగు గళమున్
నను గుండ్రని ముత్తియంపు నూత్న సరంబున్
ఘనముగ నొకటి కొకటి శో
భ నిడ, విభూషణ విభూష్య భావము సమమౌ. 48

చందురుఁగని పద్మ గుణము
లిందీవర మాశ్రయించి యిందుని గుణముల్
పొందక, యుమా ముఖంబును
పొంది చపల లక్ష్మి రెండు పొందెను గుణముల్. 49

చిఱు చివురున మల్లియ పువు
మురువౌ పవడంబు పయిని ముత్తెము నిడ, న
ట్టెఱు పయిన యామె మోవి ప
యి రుచులొలుకు స్మితమున నుకరించును రెండున్. 50

మధురముగఁ బల్కు నాయుమ
యధరంబున నుండి యమృత మటులన్ బలుకుల్
గదురఁగఁ గోయిల ధ్వని శ్రుతి
చెదరిన వీణా స్వరములును చెవికిం గటు వౌ 51

పెనుగాలిన్ గల నల్లఁ గల్వ పువుతో భేదంబు లేకుండు తీ
దునఁ బద్మాయత నేత్ర, భీతయటు లాలోకించు నా పెక్కు చూ

పృథు నేణాంగన లొద్ద నేర్చుకొనెనో మున్మృం; దటుల్ గాక యుం
డిన నేణాంగన తే యుమాంతికమునన్ శిష్యాత్వముం జేసెనో॥ 52

హసగు రేఖ లున్న యుమకన్బొమల సొరు
పుడక కాటుకచేఁ దీర్పఁబడిన యటుల
నయి సహజ విలాస చతుర మౌటఁ గాంచి
మదనుఁడు స్వచాప సౌందర్య మదము విడె. 53

స్వాంత ముండి పసులకు సిగ్గవ్వ దున్నఁ
దష్టక గిరిరాట్సుత కురుల్ దనియఁ జూచి
వేగ చమరీ మృగంబులు స్వీయమైన
వాలముల యెడఁ బ్రీతిని వదలె యుండు. 54

మొదట సర్వోపమా ద్రవ్యములను గూర్చి
యుంచవలసిన యెడ నవి యుంచి స్రష్ట
సకల సౌందర్య వస్తుల నొకెడఁ జూడ
నెంచి యత్నించి సృజియించె నేమె యుమను 55

## పార్వతి శివునికి భార్య యగునని నారదుఁడు చెప్పుట

వ॥ ఇటు లుండ నొకపుడు నారద మహామౌని తన కిష్టమువచ్చిన చోటికి స్వేచ్ఛగా సంచరించు వాఁడై యరుదెంచి తండ్రి యగు హిమవంతుని దగ్గఱఁ గన్య యగు నా పార్వతిని జూచి యీమె ప్రేమచే హరుని శరీరములో సగ భాగము గొని యేకైక పత్ని కాఁగలదని వచించె.

ప్రౌఢ వయసు పుత్రికి వచ్చె నైనఁ దండ్రి
సురముని వచస్సు విని యన్యవరులఁ గనఁడు
అగ్ని గాక మంత్ర పవిత్ర హవిసుఁ బొంద
నన్య తేజస్సు లెందు నర్హంబు లగునె. 56

హరుఁ డేతెంచి "తనూజ నీయు" మనుచున్ బ్రార్థింప కుండంగ నా
హరునిన్ బుత్రి గ్రహించు మంచుఁ దను దానై కోరఁ డద్రీశుఁడున్

కర మిష్టంబగుఁ గాక, ప్రార్థనము భంగంబౌనొ యే మంచు న
త్పురుషుండేదియుఁ గోరఁడూరకొని యెందున్ దాఁ దటస్థుండగున్. 57

ఎపుడైతే సతి, దక్షుఁ డాత్మపిత, నిందింపంగఁ గోపించి పూ
ర్వాపు జన్మంబున యోగ వహ్నిని శరీరంబున్ విసర్జించెనో
యపుడే యా దినమే మొదల్కొని విముక్తాసక్తుఁడై సర్వ లో
క పరిపాలకుఁ డీశుఁ డుండెను త్రిలోకార్చ్యుం డపత్నీకుఁడై. 58

## శివుఁడు ధ్యానమం దుండుట

అజినంబున్ ధరియించి శాంతిగఁ దపం బాతండు గావింప; గాం
గ జలౌఘంబులు దేవదారు తరు శాఖల్ తడ్పనచోట, ప్రాం
త జ కస్తూరి మృగాల బొడ్డుపడి గంధాల్ చిమ్మ నా చోట, న
క్కజమౌ కిన్నరగానముల్ వెలయు నాశ్మాభృత్తటిన్ వర్తిలెన్. 59

ఎక్కి మంచుగడ్డల రాళ్ళ పెక్కు కొనల
గిజి, పొగరెక్కి యార్చుచు గిరిప నెద్దు-
గవయ మృగములు భీతిచేఁ గనుచు నుండ -
జంకె లిడు - సింహ గర్జనల్ సైప కచట. 60

తనదౌ వేఱొక మూర్తియౌచు సమిదా ధానంబుచే వృద్ధి పొం
దిన యగ్నిన్ హిమశైల సానువున దీప్తింపన్ ప్రతిష్ఠించి, తాఁ
దనకుం దానె తపః ఫలంబులు సమస్తంబున్ ప్రసాదించు వాఁ
డును నై యుండియు యష్టమూర్తి తపముల్ పూనెన్ మజేకోర్కెనో 61

## పార్వతి శివునికి సేవలు చేయుట

వ॥ అంత ఆగిరిరాజు, ఇంతటి పూజ్యుఁడని గణింప శక్యము
గాని వాఁడును, దేవతలచే నర్చితుండును అగు మహేశ్వరునికి అర్ఘ్య
పాద్యాదు లొసంగి. పూజించి యావినాక పాణిని ఆరాధించుటకయి నియమ
నిష్ఠలు పూనిన తన కుమార్తె పార్వతిని సఖురాండ్రతో పాటు సేవలు
చేయ నియోగించె.

సకియలు సమాధికిన్ వి
ఘ్నకరు, లయిన హరుఁడు వలదనఁడు కొలుచు సుమన్
వికృతికి హేతువు లున్నను
ప్రకృతి విడక వికృతి గనని వారలె ధీరుల్. 62

పువులన్ బూజకు నేరి తెచ్చి యిడుచున్, మున్ముందె యాహోమ వే
దివిధిన్ శుభ్రము చేసి దర్భ సమిధల్ తీర్థాంబులన్ నిష్ఠ కె
ల్లి వడిన్ దెచ్చుచు నాసుకేశి హరు నశ్రాంతంబు సేవించెఁద
ద్భవుమౌళి స్థితచంద్ర రశ్ములు శ్రమన్ స్వాల్పంబు తగ్గింపఁగన్. 63

ఇది

పార్వతి హరునికి సేవలు చేయుట

అను

మొదటి ఆశ్వాసము.

—:o:—

# కుమారస్వామి జయము

## రెండవ ఆశ్వాసము

### బ్రహ్మను దేవతలు స్తుతించుట

వ॥ అనంతరము ఆ సమము మందె తారకాసురునిచే బాధింపఁ బడి స్వర్గవాసులు దేవేంద్రుని ముందిడికొని స్వాయంభువుఁడగు బ్రహ్మ నివాసంబునకుఁ జనిరి అంత.

మిగులఁ గమలిన ముఖశ్రీ
నెగడు సురల యెదుట బ్రహ్మ నిలిచెను ద్రుటిలో
మొగిడిన తామర పువ్వులు
తగు సరసుల నుదయవేళఁ దపనుఁడు వోలెన్. 64

అవల సర్వసృష్టికిఁ గర్తయౌచు వెలసి
యన్ని వైపుల మొగముల నలరు దేవు
ధాత వాగీశు-నర్థ యుక్తంబులైన
వాక్కుల-స్తుతించి రమరులు ప్రణుతి చేసి. 65

“ఆదిన్ సృష్టికి ముందు కేవల మొకే యాత్మంబవై యుండియా
మీఁదన్ సత్త్వరజస్తమో గుణములన్ బెంపొంది భిన్నుండవై
కాదే సృష్టియుఁదత్థ్సితి ప్రళయముల్ గావించి మోదింతువా
వేధో విష్ణుహరత్రి మూర్తికిని నివ్వో నీకు మా యంజలుల్. 66

జలముల నమోఘ బీజము
మొలవైచితి వదెయజ ! భువనంబులలో
వెలసి, చరాచరమగు; నం
దులకే హేతువుగ నిన్ను స్తుతియింత్రు బుధుల్ 67

వెలయించి మూఁడవస్థల
నాలోకించితి నీ మహిమల నుత్తమ రీతిన్
ప్రళయస్థితి సర్గంబుల
నలరించి యొకఁడవె హేతువైతివి గాదె. 68

జగముల సృజియింపన్ వే
ఱగు మూర్తులఁ దాల్చు నీదు నాత్మకె భాగా
లగుదురు స్త్రీ పురుషులు, జ
న్మ గనెడు సృష్టికిని వారె మాతా పితరుల్. 69

భవదీయ కాలమానము
న వేయిగా రేఁబవ ళ్లొనర్చెడు విధి ; నీ
కెవి నిద్రయు మెలఁకువ యగు
నవె ప్రళయోదయము లగును ప్రాణులకెల్లన్. 70

అఖిల జగాలు నీ వలన నయ్యెను, నెవ్వారివల్ల నీవు కా
వఖిల జగాల కంతకుఁడ, వంతమె యెన్నఁడు నీకు లేనె లే
దఖిల జగాల కాదివఁటు యాదియె లేనటువంటి వాఁడ వీ
యఖిల జగాల కీశుఁడవె యైనను నీశుఁడె లేఁడు నీకిటన్. 71

నీ చేత నీవ యెఱుఁగుదు
నీ చేత నిను సృజింతు నిత్యము జగతిన్
వాచామగోచరుండవు
నీ చిత్తమునను లయింతు నేర్పు దలిర్పన్. 72

ద్రవమవు జలమటు, కఠినుం
డవు జాయటు, స్థూల సూక్ష్మలఘుగురుఁడవ యా
మవు; వ్యక్తుఁడ వవ్యక్తుం
డవు; నణిమాదిక విభూతుల స్వాతంత్రుఁడవున్. 73

ఏ వాక్కుల తొలి, ప్రణవమొ
ఏ వాక్కులు త్రి స్వరముల నేర్పడి వెడలున్

ఏ వాక్కు కర్మ యజ్ఞము
ఆ వాక్ఫలము దివి, దాని హేతువ వీవే. 74

ధర్మార్థ కామ మోక్షపుఁ
గర్మల నడపించు ప్రకృతి కారణ మీవే
ధర్మాది సాక్షి వగుచున్
గర్మల నంటని పురుషుఁ డనంబడు దీవే. 75

నీవే పితలకుఁ బితవున్
దేవులకుఁ గూడ నెప్పుడు దేవుఁడ వీవే
నీవే వధులకుఁ బరుఁడవు
నీవే బ్రహ్మలకు బ్రహ్మ వెందును బ్రహ్మా! 76

నీవే హవిసువు హోతవు
నీవే భోజ్యమవు భోక్త వీవుఁదు సదా,
నీవే వేద్యము వేత్తవు
నీవే ధ్యేయమవు ధ్యాత వెల్లెడ భువిలో. 77

వ॥ అని యిట్లు హృదయంగమములును యథార్థములు నైన యాయమరుల స్తుతులను విని యా ప్రజాపతి ప్రసన్నముఖుండై యా దేవతలను ఉద్దేశించి యిట్లనియె. ఆ వాక్కును—

ద్రవ్యగుణ జాతి క్రియాధన్యమగుచుఁ
దత్పురాణ కవి నలు వక్త్రముల వెడలు
* పరయుఁ బశ్యంతి మధ్యమ వైఖరియను
శబ్ద వృత్తి సరస్వతి సఫలమయ్యె. 78

---

* వైఖరీ శబ్దనిష్పత్తి ర్మధ్యమా శ్రుతి గోచరా ద్యోతితార్థాచ పశ్యంతీ, సూక్ష్మావా గనపాయినీ సూక్ష్మావాక్=పరావాక్. శబ్దములు బయలుదేఱుటకుఁగారణమైనదివైఖరి. చెవులకు వినఁబడునది మధ్యమ. అర్థములను ప్రకటించునది పశ్యంతి అతిసూక్ష్మమైనది పరావాక్కు.

# బ్రహ్మ దేవతల యోగక్షేమాదు లడుగుట

దివ్య విక్రమ మొప్పారు దేవులార!
మీదు దీర్ఘ బాహుల చేత మీ ప్రభుత్వ
విధుల మీ మహిమలఁ దీర్చి వెడలి యొక్క
పరిని యిటు వచ్చు మీకు సుస్వాగతంబు 79

ఇది వఱకుఁ బోలె మీరే
మిది మీ పూర్వపు ద్యుతి వహియింపరు, మీ మీ
వదనములు భాసిలవు, మం
చు దొంతరలఁ జిక్కు వడ్డ జ్యోతిస్సులటుల్. 80

కలయర్చిస్సులు శాంతిల
వెలికిఁ బ్రభలఁ గ్రక్కుచున్న వేల్పులధనుసుల్
గల వృత్రహు వజ్రపుటం
చు లిప్పు మొద్దువడు శ్రీలచొప్పునఁ దోఁచున్ 81

అరిదుర్వారంబగు నీ
వరుణుని హస్తమున నున్నపాశం బిదియున్
వర మంత్రమున బలము చనఁ
బిఱికిదయిన పాముపోలె వెలవెలపోవున్ 82

గదలేని కుబేరుని బా
హుదండ మిది విఱిగినకొమ్మలొప్పుతరువటుల్
మదికిని శల్యం బగుచును
నిదె వఱలెఁ బరాభవము వచించెడు రీతిన్ 83

యముఁడు కాంతి తరుగు దం
డముతో నూరక యిదిగొ పుడమి గీయుచు దం
డ మమోఘంబయినను న
ల్పమతిని నాఱిన కొఱవినిఁబలె వీక్షించున్ 84

తమ తమ ప్రతాపము నశిం
చ మిగులఁ జల్లఁబడి ద్వాదశాదిత్యులు చి

క్రమమునందు లిఖింపఁబడి
నమాశ్రిత వీర లిఖులన్ గనఁబడుదురేలన్. 85

## దేవతలు తారకాసురుడు పెట్టుబాధలు చెప్పుట

మిపులన్ దొట్రుపడుట వా
యువుల గమన వేగము చెడియున్నటుతోఁచున్
అవల నెదుట నెత్తుగఁజను
టవలనను బ్రవాహా మడ్డుటన్ జెడినటులన్. 86

వంచిన శిరసుల జడలన్
వంచలమగు చంద్రరేఖ డాఁచుచు నుండన్
మించు పదునొకఁడు రుద్రుల
పొంచిత హుంకృతి నశించి నటు గన్పించున్. 87

మునువున్ బ్రతిష్ఠ గల మీ
రును బలపత్తురుల చేతఁ ద్రోయఁగఁ బడిరే
కని సామాన్యంపు శాస్త్రపు
జనులను నపవాదము లవి బాధించునటుల్. 88

కనుకన్ నాయనలారా!
వినుమఁడు నన్నుండి యేమి వేడఁగ నేతెం
చిన వారో, సృజించుటె నా
పని; మీ యెడ రక్షణంబొ వర్తిలుఁ గాదే. 89

వ॥ ఇటులు ప్రజాపతి పలుక-

ఇంక మందవాయుల చేత నెగురఁ గొట్టఁ
బడిన తామరకొల నట్లు వఱలుచున్న
వేయి కన్నుల చేత దేవేంద్రుఁ డపుడు
గురుని దెలుపఁగఁ బ్రోత్సాహపఱచె వేగ. 90

వ॥ అపుడు దేవేంద్రుని వేయి కన్నుల కంటె నధిక సమర్థములైన రెండు కన్నులు గల యా బృహస్పతి దోసిలి పట్టుకొని జలజాసనునితో నిట్లనియె. ఓ భగవానుఁడా! నీవు చెప్పినట్లు మా పదవులు రాక్షసులచే ఆక్ర

మింపఁబడినవి ప్రభూ ! నీవు సర్వాంతర్యామివి గదా ఈ సంగతి నీ వెట్లు తెలియవైతివి నీ వల్ల వరములు గొని తారకుఁడను రాక్షసుఁడు గర్వించి తోఁక ముక్క వలె లోకములకు విద్రోహము గల్గించుచున్నవాఁడు.

ఏ విధమగు నెండలు దిగుడుం
బావుల పద్మములు విచ్చఁబడనయి యుండున్
ఆ విధపు టెండె కాయును
ఆ వేళ తపనుఁడు తారకాసురు పురిలో. 91

పదునాఱు కళలతో శశి
సదా యసురపతి సేవ సలుపుచు నుండున్
ఇది యొక హరు శిరోమణి
గఁ దనరుకళను మాత్ర మతఁడు గ్రహియింపఁడుగా. 92

పువుఁ దోటలలో నెప్పుడు
పువులన్ హరియించు చొఱవ పూనకయే వా
యువు తారకు ప్రక్క విసరఁ
గ వెఱచు వీవనల గాలి కంటెను నతిగా 93

వరుసగ సేవింప వదలి
విరులను బ్రోవులుగఁ గూర్చ వేడుక గలదై
నిరతంబు తోఁట మాలల
కరణిన్ ఋతువులును తారకాసురుఁ గొలుచున్. 94

కానుక లీయఁగ యోగ్యము
లైన యమూల్యపు రత్నరాశి సముద్రుం
డే నాఁ డెట్టెటు పక్వము
లౌనా యని నిరీక్ష చేయు నాతని కొఱకై. 95

వాసుకి మొదలగు సర్పా
ధీశులు తమ తలల నున్న యెల్ల మణులతో

దేవతలు తారకాసురుడు పెట్టుబాధలు చెప్పుట 18

భాసిలుచున్ స్థిర దీపము
లై సేవింత్రు నిశలందు నా రాక్షసునిన్ 96

ఆతని యనుగ్రహమునకు
దూతలచేఁ గల్ప వృక్ష దుగ్ధసుమంబుల్
ఏ తఱినయినను పంపుచు
నాతని ననుకూలుఁ జేయు నమరేంద్రుఁడున్. 97

అనయం బితు లారాధిం
చినను జగత్త్రయము నతఁడు చెడ బాధించున్
కని ప్రత్యుపకృతి గావిం
చినఁ గాని యుపకృతి శాంతి చెందరు దుష్టుల్. 98

కరుణన్ గరముల సుర సుం
దరులు చివురులఁ గొనుచుండు నందన తరులన్
కరుణ విడి తారకు భటులు
విఱుచుచుఁ గోయుచును గొట్టివేయుదు రెప్పుడున్. 99

చెఱఁబడు సురసతు-లశ్రుల
నెఱిఁదడిసిన చామరముల నిద్రితు ననుదిన్
చిఱు శ్వాసలతో సమముగ
వెరవున పవనములు సోక వీచెద రచటన్. 100

విశదమగు మేరు శృంగాలఁ బెల్లగించి
సూర్య తురగాలఁ ద్రొక్కించి సురలు చూడఁ
దనదు భవనాలఁ గేళి భూధరములుగను
గూర్చి విహరించు చుండు రక్షో విభుండు. 101

ఇపుడు దిగ్గజముల నెంతో ముఱికి
పైన జలములె మిగిలిన నమర నదిని
అందుఁగల పైడి తామరలన్ని వీకి
తన దిగుడు బావులలో నతండు పాతె 102

తారకుఁడు వచ్చునో యని తద్భయాన
ఆ విమాన మార్గము లన్ని యంతరింప
సకల సురలకు భువనముల్ చక్కఁ జూచు
నెల్ల ప్రీతియు నిపుడు క్షీణించిపోయె. 103

యజ్ఞముల నాచరింతుము యజ్వులిచ్చు
హవ్యముల నెల్ల మేమంద జాయు చుండ
అగ్నిహోత్ర ముఖము నుండి యతఁడు బలిమి
మాయ వహియించియును లాగివేయుచుండు 104

ఆతఁ డుచ్చైశ్శ్రవంబను నశ్వరత్న
మపహరించి కొనియెపోయె నందఱెదుట
ఎంతొ కాలంబు నుండి యర్చించి యుంచు
మూర్తి దాల్చిన యమరేంద్రు కీర్తిఁ బోలె. 105

వ॥ అతని మీఁద మేము ప్రయోగించిన యుపాయము లన్నియు సన్ని పాత జ్వరాదు లందు శక్తివంతములైన యౌషధుల వలె వ్యర్థంబు లయ్యె. మేము దేనిపైని ఆధారపడి యుంటిమో ఏది ప్రహరించి యచ్చిస్సులను వెడలఁ గ్రక్కునో యట్టి విష్ణుచక్రము గూడ అతని కంఠమున వేయఁబడిన భూషణమయిన హారము వలె నయిపోయె నేఁడు ఆ తారకుని గజములు ఐరావతమును గెంటివైచి పుష్కరావర్తకాది మేఘములపైని వప్రక్రీడలం దేలుచు విజృంభించుచున్నవి. కావున ఓ సర్వలోక విభూ! అవధరింపుము ముముక్షువులు సంసార బంధములను ఛేదించుటకై ధర్మమును బోలెను తార కాసురుని శాంతింపఁ జేయుటకై యొక సేనా నాయకుని సృజింపఁ గోరు చున్నాము సుర సైన్యముల నడపించెడియూ సేనా నాయకుని ముందుంచు కొని గోత్ర భేదకుండైన యమరనాథుఁడు బందివలె నున్న జయలక్ష్మిని తిరుగ శత్రువుల చేతినుండి విడిపింపఁ గలఁడు అని యిట్లు వాచస్పతి విన్న వింప నుఖముల పిదప వర్షమును వలె సౌభాగ్యయుక్తమైన వాక్కును ఆ బ్రహ్మ కురిపించెను.

మీరలు కోరిన కోరిక
తీఱును నిదె కొంతవడిఁ బ్రతీక్షింపుఁడు, మీ

గార్యసిద్ధిని నిశ్చయించికొని ద్విగుణ వేగము గల మనస్సున మన్మథునిఁ
దలంచెను. అంత -

అందపు బొమ్మ కన్బొమ లొయారపు వంపుల యంచులట్లు చె
క్కందన మీను విల్లు వ్రియుకంఠణ రేఖలఁ బొల్పు గ్రీవ వ
క్షం దగ నాన్చి, మిత్రుఁడు వసంతుని చేతికి మావిపూత, య
మ్ముందమి నిచ్చి, యింద్రునికి మందర వ్రాతెస్మరుండు నమ్రుఁడై. 110

ఇది

బ్రహ్మ సాక్షాత్కార మను

రెండవ ఆశ్వాసము.

—:o:—

# కుమారస్వామి జయము

## మూఁడవ ఆశ్వాసము

### మన్మథుడు తన్నుఁ దలఁచినపనియేమని ఇంద్రు నడుగుట

అపుడు దేవేంద్రు వేయి కం డ్లఖిలసురల
వదలి యొక్కమారె యాస్మరుపైని వ్రాలె
ప్రభువులు ప్రయోజనమె కోరువారు గాన
తఱమ వారి కాశ్రిత సమాదరణ చలము. 1

ఇటు మూర్ఛ్యం, డని ప్రక్కకున్ జరిగి దేవేంద్రుండు మర్యాదమై
నట నర్ధాసనమీయ. లోన మరుఁడింద్రానుగ్రహం బెంచుమన్
నిటలంబందుఁ గరాలు మోడ్చి యభినందించెంతో యామీఁదతా
నిటు దేవేంద్రునితోడ వాకొనెఁగరం బేకాంతమౌ నాస్థలిన్ 2

వ॥ దేవేంద్ర! యవధారు. నీవు ఏ పురుషులెట్టివారో వారి విశేషము తెలిసినవాఁడవు, ఆజ్ఞాపింపుము. లోకంబులందు నీవు చేయవలసిన పని యేమిగలదు, నీవునన్ను స్మరించి యనుగ్రహము చూపితివి, దానిని వృద్ధి పొందించుకొనుటకై యేనీయాజ్ఞ నెఱవేర్చఁగలవాఁడనో తెలుపఁగోరు చున్నాను.

భవదీయేంద్ర పదంబుకై మిపులఁ దీవ్రంబౌ తపంబున్ జిరం
బవడైనన్ బొనరింపఁ బూనుకొనెనా యేమీ. సురేంద్రా, వచిం
పు వడిన్ వాఁడిదిగో శరాల్ తొడిగి ముమ్మందే యిటున్ సిద్ధమై
కవియం బోయెడి నా ధనుస్సునకు లక్ష్యంబయ్యె నంచెంచుమీ! 3

నీకున్ సమ్మతిలేనియాతఁడెవడేనిన్ జన్మమృత్యు వ్యథల్
లేకుండన్ బొనరింప. మోక్షపథముల్ చేపట్టినా యేమి, యే
లోకమ్మందతడున్న వానిఁ గుటిల భ్రూ విభ్రమక్షేపి కాం
తా కర్ణాంత చరత్కటాక్షపు వలన్ బద్ధున్ సదా చేయుదున్॥ 4

గురువౌ శక్రుఁడు నీపలన్ గలుప నుగ్రుండై విజృంభించు నీ
యరి యెవ్వాఁడివి యర్థకామములు రాగాసక్తియన్ జారునిన్
త్వరగాఁ బంపుమె పాశుచేయుదు నొకో స్వర్గాధిపా! వేగ పల్
వరదల్ వచ్చుటఁ బొంగిపొర్లు జలపూరంబేటి గట్లు బలెన్॥ 5

పాతివ్రత్యాపుదేశ శీలవతియై వర్తిల్లి సుశ్రోణియౌ
నే తన్వంగియు గాని లోల హృది నీకిం పౌచు లోఁ జొచ్చెనా
బతే విస్మృతు సిగ్గువీడి తనుదానై వచ్చి కంఠంబునన్
బ్రీతిన్ బాహుల గ్రుచ్చి కౌఁగిలిడు నట్లే చేయుదున్ చూడుమీ॥ 6

ప్రణయమునం దెదేని యపరాధము చేసి పదాల వ్రాలినన్
గణుతి యొనర్పకుండ నినుఁ గాముక! కోపన యెవ్వతేని ద్రో
చెన గను, మాయొయారినిదె చేయుదుఁ జేసిన దాని కుల్కుచున్
ననువుఁ జివుళ్ళ పాన్పు శరణాంచు శరీరముగల్గు దాఁకగన్॥ 7

వ॥ వీర! ప్రసన్నుడవగుము, ఇప్పుడైనను నీ వజ్రాయుధము విశ్రాంతి పొందుఁగాక, నా బాణంబులకు గురియై యేయమరారి తన బాహు వీర్యమంతయు వ్యర్థముకాఁగా కోపముచే నదరు నధరములుగల యింతులకును భయపడి పఱుఁకు చుండి నిలవవలయునో. నీ యనుగ్రహమువలన నేను పువ్వులే యాయుధములుగల వాఁడనయినను ఒక వసంతునినే సాయముగొని పినాకపాణి యగు హరునికిఁగూడ ధైర్యము పటాపంచలగునట్లు చేయఁగలుగువాఁడను. అట్టిచో నింక నితర సామాన్య ధనుర్ధరులమాట లెక్కయేమి" అని యట్లు మన్మథుఁడు పలుకఁగా నపుడు-

## శివుని పార్వతిని పెండ్లియాడునట్లుచేయుమని మన్మథునితో ఇంద్రుడు చెప్పుట

తొడపై శివగ వేసికొన్న కుడికాల్ తూర్ణంబుగా దించి య
క్కడఁ గ్రిందన్ మణిపాద పీఠకకు భాగ్యంబియఁ గాలొత్తుచున్
ఎడదన్దా దలపోయు కార్యమును సాధింపంగ సామర్థ్యమున్
బడయం గల్గిన యట్లు తెల్పు స్మరుతో వాక్రుచ్చె నింద్రుండిటుల్॥ 8

"అవు నీవింతటి వాఁడవే యవుదు మిత్రా! నాకు రెండై యు
న్నవి యస్త్రంబు, లొకండు వజ్రమిఁక రెండౌనస్త్రమో నీవె, వ
జ్ర విహారంబు తపోబలాధికుల వ్యర్థంబే యగున్, నీదు వీ
ర విహారంబుల కెందునడ్డగన, మెల్లన్ నీవె సాధింతుగా 9

ఎఱుఁగుదు నీదు శక్తి యిఁక నిందుకె మత్సముఁడైన నీకిటుల్
గురుతర కార్యభారమును గూర్పఁగ నిప్పుడె యప్పగింతు నీ
ధరణి ధరించు శక్తిగలదౌటను గన్గొని విష్ణువు నాదిశేషునిన్
నిరతము స్వీయ దేహమును నెమ్మది మోయఁగ నిచ్చెనానతిన్ 10

ఎదియున్ మేముతలంచి నీమన్మరణం బీరీతిఁ గావించినా
మదియే చేసి "త్రినేత్రునంత ఘనధైర్యంబేన్ పటాపంచ చే
సెద"నంచున్ వచియింతు; మా పని యిఁకన్ సిద్ధించినట్లే. బలో
న్మద శత్రుల్ గల యజ్ఞభాగ భుజులౌ మా బోంట్ల యిష్టంబిదే 11

వ॥ ఈ దేవతలు శత్రుజయమునకై హరుని తేజస్సువలనఁ గలిగిన వానిని సేనాపతిగ కోరుచున్నారు, బ్రహ్మవిషయక మంత్రాంగములకు స్థానమై బ్రహ్మమందు నియమము నుంచుకొన్న యాత్మగల యా హరుని నీ బాణము మాత్రమె సాధింపఁ గలదు, హిమవంతుని తనయయు నియమముగలదియున గు పార్వతి నియమిత స్వాంతుడైన యతని కిష్టురాలగు నట్లు చేయ ప్రయత్నించుము. ఆ హరుని తేజస్సును ధరింప స్త్రీలలో నా పార్వతియే తగిన క్షేత్రమని ఆత్మభువుఁడు ఉపదేశించెను హిమాలయపుఁ బైచఱియయందు, దపస్సు చేయుచున్న యా యీశ్వరుని తండ్రిపనుపువే ఆ పార్వతి ఉపాసించుచున్నదని అప్సరసల ముఖమునుండి వినియున్నాను ఆ యప్సరసల గణమె నాకు గూఢచారిణు లను సంగతి నీవెఱుఁగుదువుగదా.

కనుకన్ బోవుము దేవకార్యమిపుడే గావింపఁగా, నీ ప్రయో
జనమున్ వేఱొకరీతిగాఁ గనయినన్ సాధింపఁగా వచ్చునై
నను, నుత్పత్తికి ముందటన్ మొలకగన్ బైర్దేరు బీజంబు నీ
రునపేక్షించెడు నట్లు నిన్నిదియె గోరున్ శ్రేష్ఠమౌ హేతుఁగన్. 12

అమరులు గెల్వ, నీయ, దనువైన యుపాయము, నీసుమంపుట
స్త్రమొకటి తక్క నింకెదియు శంభుని సోకఁగఁజాల దిందవ
శ్యము కృతకృత్యుఁడౌదు, పరులాచయిరింపఁగ లేని కర్మ, లో
కమునను నప్రసిద్ధమగుఁగాక యుదంతయుఁ గీర్తి కూరుమన్. 13

నిన్ను నర్థించువారో యా నిఖిలసురలు
పొనరు కార్యమొ యామూఁడు భువనములది
నీ ధనుసు చేయువనొ యంత బాధయిడని
దేమి నీవీర్యమెంత వింతైన "దనుచు. 14

త్రిదివేశుండిటు పల్కయట్లెయనుచున్ దేవేంద్రునయ్యాజ్ఞ మ
న్మథుండంతన్ బువుదండవో లెశిరసా మన్నించి బైల్దేరఁగా
ప్రథితైరావణ కుంభఘట్టనకఠోరంబైన హస్తాన మ
న్మథు దేహంబును తట్టె నింద్రుఁడెలమిన్ బుష్పాస్త్రు డుప్పొంగఁగన్

## మన్మథుఁడు హరుని యాశ్రమమునకేగుట

వ॥ అపుడు మన్మథుఁడు తనకిష్టుఁడగు వసంతుడును సఖురాలయిన రతీదేవియు "ఇందేమి కీడుమూడునో గదా" అని యాశంకతో తన్ను అను సరింప, బయలుదేఱి తనశరీరము ఆహుతిచేసి యయినను దేవకార్యమును నెఱవేర్పవలెనను కోరికతో హిమవత్పర్వతమందున్న యాస్థాణుని యాశ్రమమును జేరెను. ఆ వనమందు జితేంద్రియులయిన మునుల తపస్సమాధికి ప్రతికూలుఁడైన వసంతుఁడును మనోభవుండగు మన్మథుని యభిమానమైనట్లు గఁదన్నుఁగూర్చుకొని విజృంభించె, అంతసూర్యుండు సమయము దప్పి కుబేరునిచేఁ బాలింపఁబడు నుత్తరదిశను చేరఁ దొడఁగెను. దక్షిణదిశ ముఖముతో గంధవహుని దుఃఖముచేఁ గలుగు నిట్టూర్పునువలె వదలెను.

## వసంతఋతువు వర్ణనము

మిపులఁగ నందెలు ఘల్లని
తవులు కొన నొయార్లకాలి తన్నులు తినఁకే

చివురులు తొడిగి యశోకము
పువులన్ మొదలంటఁ బూచెఁ బూర్తిగఁ ద్రుటిలో **16**

చిఱుత చివుళ్లలమొల్లల
మురువుదళవుఁ గొత్తమావిపూఁత శరమ్ముల్
నెఱయగనటు స్మరునా మా
శరములవలె భ్రమరముల వసంతుఁడు నిలిపెన్. **17**

రంగు గొప్పదెగాని సౌరభములేక
కొండ గోగుపువ్వు మదికిన్ గూర్చుబాధ
తఱుమ గుణముల సామగ్రి నెఱవునపుడు
సృష్టికర్తచేయును నెది యేనిలోటు **18**

విడువమి మోదుగు మొగ్గలు
నడరిచిఱు శశివలెవ్రక, మతి యెఱుపై, య
ప్పుడె వనధరణిఁ గలిసిన
నడరు వసంతుని నఖక్షతాళిని బోలెన్ **19**

వ్రాలిన గండుతుమ్మెదల బారులకాటుక తీర్చి చిత్రమౌ
లీల, వసంతలక్ష్మి కొనవ్రేళ్లలతోఁ దిలకంబుదిద్ది యా
బాలదివాకరద్యుతులవంటి సుకోమలమైన రక్తిమన్
బాల నలంకరించుకొనెఁ బక్కనికెంపుఁ జివుళ్లమోవినిన్. **20**

పొలుపౌ మావుల పాలవెల్లమురువౌ పూగుత్తి పుప్పొళ్లపల్
నలుసుల్ వేపడి పోవుమార్గము గనన్ రాకుండఁ గావించినన్
దలఁగంబోక కరంబు గాలికెదురున్ సంచారమేగున్ మృగం
బులు గ్రొవ్వెక్కియు, రాలు రాకలధ్వానుల్ పూరింపవన్యోర్వ్యాలన్ **21**

మనుగ్రొమ్మావిచివుళ్ల మెక్కిగళమున్ పూరించి కొంగ్రొత్త తీ
యనికంఠంబున గండుఁగోయిలలు శ్రావ్యంబైన యే మాధురిన్
దనుకంజిమ్మెనొ యవ్వెమానినులకున్ మానంబు భగ్నంబుగాఁ
బొనరింపన్ బలుశక్తినిచ్చు మదనామోఘాజ్ఞ వాక్యంబులై. **22**

హిమకాలంబు గతించిపోవ విశదంబైయైనకెమ్మోవి, క్రొం
జెమ తెల్లంబడు మోముకాంతిమిపులన్ జెన్నారునాకిన్నర
ప్రమదల్ పోఁకుగ దిద్దిపూనికొనుపల్ మైపూఁతలంబొల్చు వ
క్త్రములల్ క్రొంజెమటల్ చెమర్చెఁ జిఱుముత్యాలట్లు భాసిల్లుచున్ 23

ఇటులన్ కాలముకాని కాలమునఁ బెన్ స్వేచ్ఛన్ విజృంభించి యు
త్కటమౌరీతి వసంతుఁడెల్ల ప్రకృతిన్ తార్మాఱుగావింప న
చ్చట ఫాలాక్షుడు నిల్చునావని నివాసంబున్న మౌనీంద్రులె
ట్టటో యత్నించి మనో వికారములులోనే నిల్పినారయ్యెడన్ 24

పువ్వింటన్ మరుఁడెక్కుపెట్టి, రతిసొంపుల్ తోడునీడై చనన్
భవునయ్యాశ్రమభూమిలో నడుగు మోపన్ వచ్చెనో లేదో కా
నివడిన్ స్థావర జంగమ ప్రకృతి తానే జంటయై హద్దులే
గ వెలార్చెన్ క్రియచేతఁ బ్రేమరస మగ్నంబౌ మనోభావముల్. 25

ప్రియతేఁటి వెనువెంట వెడలితేనియలాని
భ్రమర ప్రియుఁడొక పూఁబాత్రలోనె
స్పర్శ సుఖముచేత సగము కన్నులు మూని
లేఁడిఁ గొమ్మున మగలేడి గోకె
తమ్మిపుప్పొడి తావిఁ జిమ్ము గండూషోద
కముఁ బ్రేమను గరిణి కరికొసంగె
సగము కొఱికి రక్తిఁ జక్రవాకము తమ్మి
కాడఁ బ్రియకునిచ్చి గారవించె
చెమట బిందులు పయిఁబూఁతఁ జెరిపివైప
విరులమధ్య మానుటఁగనుల్ తిరిగిపోవ
నందముల నీను ప్రియురాలి యాననమును
గీతములమధ్య ముద్దిడెన్ గిన్నరుండు. 26

విరియు పువుగుత్తుల చనులు
మురువగు కొంగ్రొత్త చివురు మోవులు గలయా

గిరిశీవె ప్రియలు తరులకు
మురిసియిడిరి వంగు కొమ్మ భుజబంధనముల్, 27

హరుఁడాయింపగు వేళనప్సరస లొయ్యారాలపింపన్ మనో
హరగీతంబుల వింపఁగూడ నెఱపెన్ స్వాత్మానుసంధానమే
నిరతంబున్ తమ నిగ్రహించు వశులన్ విఘ్నంబులొక్కప్పుడున్
దరియంజాలవు, తత్సమాధి నెటులన్ భంగింపలేవెట్టులున్ 28

పొదరింటిన్ వెలిద్వారసీమకడకున్ ముందేగి నందీశుఁడ
య్యదనన్ డాపలిముందు చేతను దృఢంబౌ పైఁడి వేత్తమున్
గదియంబట్టి పదేపదే ప్రమథులన్ గద్దించి పల్మారు మో
మెదుటన్ తర్జనినుంచి హెచ్చరిక గావించెన్ మతిన్ నిల్పఁగన్ 29

వ॥ ఇట్లు నందీశ్వరుండు చాపలము మానుండని శాసింపఁగా

మెదలవు వృక్షము లెవియున్
గదల వశులు, పక్షులెల్లఁగనె మౌనంబున్
వదలెను నడకలు మృగములు,
తదాజ్ఞ వనమెల్లఁజిత్రితాకృతియయ్యెన్

వ॥ అంతట పథికులు ప్రయాణ సమయమున శుక్రుని కెదురుపోక శుక్రదృష్టిని తప్పించుకొని పోవునట్లు మన్మథుఁడు ఆ యీశ్వరుని దృష్టి పడకుండఁ దప్పించుకొని పోయి గిరిప్రాంతముల సురపొన్న సున్నలు గుబురుగఁ బెరిగి కొమ్మలు కప్పియున్న-భూతేశుఁడు ధ్యానమున మునిఁగి యున్న-యా ప్రదేశమును జేరెను. అట్లు చేరి మన్మథుఁడు తనకు కాలము సమీపింప - దేవదారు తరువులు పరివేష్టించి యున్న వేదికపయిని వ్యాఘ్ర చర్మముపయిని వీరాసనంబున సమాధి నిష్ఠలో నిమగ్నుఁడై యున్న యాత్రినేత్రుని గనుంగొనియె నపుడు.

## ధ్యానమందున్న హరుని మన్మథుఁడు చూచుట

అనువై ముందటిమేను వంగక స్థిరంబై యుండ, వీరాసనం
బునమేన్ సాచియుఁ గూరుచుండి కడు మూపుల్ రెండు నమ్రంబులై

ధనరన్, రెండు చేతులంఘ్రుల పయిన్ దాల్పంగ, నంకంబునన్
నునురేకల్ విడుతమ్మిపూవు చెలువూనన్ ధ్యాని రుద్రుండటన్ ౩1

జడగుంపంతయుఁ బాముచేతఁ బయికిన్ జక్కంగ బంధించి, య
క్కడ రుద్రాక్షపుమాల రెండు మెలికల్ గా వీనునన్ జుట్టియున్,
మెడలోఁ జిమ్మెడు నీలకాంతులు నిఁకన్ నీలంబుగావింప నా
మృడుఁడంతన్ ముడివైచి తాల్చె మెడలోఁ గృష్ణాజినం బెంతయున్ ౩2

చిఱుకాంతిన్ స్తిమితంబులై పయిపయిన్ జిందించు కన్గ్రుడ్లు పెన్
ముఖ్యై చూడఁగ; గన్బొమల్ వికృతులల్ చూపించుటల్ మానియున్
స్థిరమై నిల్వఁగ, ఱెప్పలాడక నిలన్: గ్రీఁగంట్లఁ బాల్వ్యాయుదృ
క్కిరణాల్ క్రిందిడి నాసికాగ్రమున వీక్షించున్ భవుండక్షలన్॥ ౩3

స్వశరీరంబున లోన వాయువుల సంచారాల్ నిరోధించు నా
వశి రుద్రుండట. వర్షసంభ్రమము చూపంబోని మేఘంబటుల్
భృశమున్ బైపయికేగుచుండు లహరుల్ లేపన్న సంద్రంబటుల్
శ్వాసనంబింతయులేని చోటఁగలదీపంబట్లు శోభిల్లెడున్ ౩4

తలయందుండిన పుఱ్ఱెకంటి కడ లబ్ధంబైన మార్గంబులన్
దలలోనుండియె పైకిఁబర్వు పరిశుద్ధజ్యోతి నున్మాల్కలన్
జెలువౌతామరతూడు నూలుకొనకంటెన్గూడ సున్మత్తనై
పొలుపుల్ చిమ్మెడు బాలచంద్రుసిరులన్ వాడంగఁజేయుంగడున్ ౩5

తన కన్నుల్ చెవులాదిగాఁగల నవద్వారాలఁ బోనీకయే,
మనసున్ ధ్యానవశంబొనర్చి, హృది సమ్యక్స్థాపనంజేసి, దే
నిని క్షేత్రజ్ఞులు నక్షరంబయనుచున్ నిర్దేశముంజేతు, రా
ఘనమౌ నాత్మను నాత్మలోఁగనుచుఁ బ్రజ్ఞానందుఁడౌతండగున్॥ ౩6

అటులన్ ధ్యానసమాధిమగ్నుఁడయి బ్రహ్మాద్వైత రూపొందునా
నిటలాక్షన్-మదిచేతనైన నెదురన్ లేఁట్టి యుండేవు, ము
దట వీక్షించి స్మరుఁడు సాధ్వసము చేతన్ పుష్పహస్తంబుతో
నటఁజేజాఱి ధరిత్రిఁబడ్డ పువువిల్లైనన్ గనండయ్యెడన్. ౩7

స్మరుఁడప్పంతకుముందె వీర్యమడి నష్టప్రాయుఁడై యుండ, న
త్తఱి-నిత్యంబు ప్రవృద్ధిచెందు తన సౌందర్యంబు చే-వానిఁ గ్ర
చ్చఱ నుజ్జీవితుఁజేయవచ్చు నటు దోఁచన్ శైలరాట్పుత్త్రి యా
దరికంతన్ వనదేవతా సఖులతోఁదావచ్చి కానంబడెన్ ॥ 38

తళుకుంగెంపులఁ ద్రోసి రాజనెడి రక్తాశోకపుష్పాలు, సు
జ్వాలమౌ బ గరంగు గోఁగుపువులున్, స్వచ్ఛంపు ముత్యాలకా
లుల నిగ్గుల్ చిలికించు వావిలిపువుల్ లోనైనవాసంత ర
మ్యాలతాంతమ్ములె భూషణవ్రజముగా నాగౌరిదాల్చెన్ గడున్ ॥ 39

ఉరుకుచ యుగ్మభారముననో, యనఁగొంచెమువంగు మేనితోఁ,
తరుణ దివాకరారుణిమ తళ్కును వల్వను గౌరిదాల్చియున్,
మురువగుపూవు గుత్తిబరువుల్ భరియింపఁగలేక వంగుచున్
చిఱుత చివుళ్లనిండి ధరణిన్ దిరుగాడెడి తీవెఁబోలెడిన్ ॥ 40

అనువగు చోటెఱింగి యెపుడో మదనుఁడిటు దాచియుంచియే
మునుకొని నేఁడు గైకొను నమోఘపు రెండవనారియో యనన్
బొనరు నొయారపుం బొగడపూ మొలనూల్ మొలనుండి మెల్ల జా
ఱిన నగఁ ద్రోసి దిద్దుచు పొరింబొరి పార్వతి వచ్చె నత్తఱిన్ ॥ 41

సురభుల్ చిమ్మెడి శ్వానకాసపెరుగన్ ఝుమ్మంచు బింబోష్ఠపుం
దరి, వేగన్దిరుగాడు నాపొగరుబోతౌ గండుదౌ తుమ్మెదన్
అరమోడ్పుంగనుదోయి చం చలపుఁజూ పందంద ప
ల్మరుసారించి విదిర్చె శైలసుతలీలాబ్జంబుచేఁ గొట్టుచున్ ॥ 42

వ. అంత ఏయవయవ రచనయందును లోటులేక అనవద్యయై, రతీదేవికిఁ
గూడ సిగ్గుగలిగించు సౌందర్యముగల యాపార్వతిని జూచి కుసుమాయు
ధుఁడు "జితేంద్రియుఁడైన యాత్రిశూలధారిని నిపుడే జయించి స్వకార్య
సిద్ధిఁ బడయఁగల సమయంబు వచ్చెనని తలఁచెను. అపుడు గిరిజ తనకుఁ బతి
కాఁబోవు శంభుని యాశ్రమ గృహద్వార భూమికి వచ్చెను. అపుడే

ఆశంభుఁడును పరమాత్మునిపేర వెలిఁగెడి యాపరంజ్యోతిని దర్శించి తాను తనధ్యానమును ముగించెను, పిదప సర్పాధిరాజైన ఆదిశేషువు తనపగడల కొనలచేత ప్రయత్నపూర్వముగా అయీశ్వరుఁడున్న భూమి క్రిందిభాగమున దృఢముగా నదిమిపట్టి ధరించియుండ మెల్లన వాయు బంధమును విడిచిశంకరుఁడు వీరాసనమును సడలిచెను అపుడు విన యముతో నందీశుఁడు నమస్కరించి శుశ్రూషకై పార్వతివచ్చిన" దనితెలిపి-ప్రమథనాథుడు అంగీకారసూచకముగా కనుబొమ్మను కదప ఆమెను ఆమె సఖురాండ్రతోపాటు లోనికి ప్రవేశపెట్టెను ॥ 43

ఋతురాజైన వసంతుఁడావని విజృంభింపంగఁ బుష్పించు వా
సితపుష్పంబులు స్వీయహస్తములతోఁ స్నేహంబుతోఁగోని స
మ్మతి నందందుఁ బిపుళ్లబొంపములు సమ్మానించి దోసిళ్లతో
ప్రతి యాశంభుని పాదమూలముల మెల్లన్ జల్లిరంతన్ సఖుల్ ॥ 44

ఉమయున్—మన్నని నీలిముంగురులలో నొయ్యారమొప్పార నం
దముగాఁదీర్చిన కొండగోగుపువు సుంతన్ జాఱి ప్రేలాడఁ, గ
ర్ణమునన్ జాఱిన లేత క్రొంజిగురులన్ రంజిల్లు మూర్ధాన హ
స్తములన్ మోడిచి యాత్రిశూలికి నమస్కారంబు చేసెన్ దయిన్॥ 45

"అతివను నెవ్వాతెన్ బదయనంతటి భర్తనుపొందు"మంచుఁ బా
ర్వతికి హరుండు తథ్యమగు రమ్యశుభాశిషమిచ్చెఁ బావన
వ్రతులగు నుత్తముల్ పలుకు పల్కులులోకములోన నెన్నఁడున్
వితథము గావు, వారెవుడు వేడుక కోసముపల్కరేదియున్ 46

సమయం బెప్పుడు వచ్చునాయని ప్రతీక్షన్ జేయుకాముండు వ
హ్నిముఖంబున్ బొలుపొందునామిడత యట్లేయోచు ముక్కంటి ల
క్ష్యము గావించుచు మాటిమాటికపుడున్ చాపంబుపై కెత్తియే
యుచుకన్ ముంగటవింటినారిని బలంబొప్పన్ స్పృశించెన్ వడిన్ 47

సురనదిలోపలన్ బొడమి సూర్యకరాళికి విచ్చియెండు తా
మరపువు గింజపూసల నమర్చియు గుచ్చి జపంపుమాల, తా

మ్రురుమలనీను హస్తమున రమ్యముగాఁగొని గౌరి మానియౌ
గిరిశునికిన్ వినమ్రయయిగేలు మొగిడ్చియు నిచ్చెనంతటన్॥ 48

ప్రణయులయందుఁ బ్రీతిగలవాఁడగుటన్ హరుఁడాజపంపు మా
లను గ్రహింప నంతటఁదొరంకొనె, నప్డెసుమాయుధుండు మో
హన మనుపేరుతోఁ బ్రథితమైన యమోఘశరంబు శీఘ్రమే
ధనువున నెక్కుపెట్టి మదిధైర్యము మిక్కిలిచిక్కఁబట్టుచున్॥ 49

సరిగానప్పుడె ధీరుఁడయ్యు హరుఁడున్, చంద్రోదయారంభమౌ
తఱిసంద్రంబటు, పొంగిసుంత పరిలుప్తంబైన ధైర్యంబుతో
మురువౌ పండిన దొండపండువలె సొంపుల్ గుల్కు కెమ్మోవిచే
సరసంబౌ నుమ మోముపైఁ గనులతో సాగించెవ్యాపారముల్॥ 50

నలువైపుల్ వికసించు లేకడిమిగున్నంబోలె నువ్వొత్తుగన్
బులకల్ పూచిన మేలియంగములచేఁ బొల్పొమనోభావముల్
వెలికిన్ బార్వతి-వెల్లడించుమను నట్లట్టుల్ త్రిప్పునేత్రాల మి
క్కిలి నందాలిడు మోముతోనిలిచె నిగ్గేపార నడ్డంబుగన్॥ 51

అంతనాముక్కంటి తనయింద్రియము లిట్లుక్షోభించుటను దెలిసికొని యాతండు జితేంద్రియుండు గావున వానిని బలవంతముగా నిగ్రహించుకొని తన మనస్సులో ఇట్లు వికారము జనించుట కేమి హేతువై యుండునో యని చూడఁగోరినవాఁడై దిక్కులవైపుగా తనదృష్టిని నిగుడించి కనియెన్

శంకరుఁడాక్షణంబ కుడిక్రేగంటన్ స్వాముష్టిన్ ధరిం
చి, నతాంసుండయి సుంతవంచుకుడికాల్ చెన్నారఁగా రమ్యమౌ
ధనుసున్ చక్రమువోలెవంచి శరసంధానంబు గావించుచుం
డిన పుష్పాస్త్రు జగద్విమోహను స్ఫురన్నీరేజనేత్రున్ మరున్.

ఇట్లు తనతపంబును బాడుచేయ యత్నించు మన్మథునింగాంచి కోపంబు వృద్ధిపొందఁ గన్బొమలు యాముక్కంటిచిట్లించి చూడశక్యంబుగాని ముఖంబు గలవాఁడై కాఁగా నంతనాతనిమూడవకంటినుండి యంతలో పైకి జ్వాలలు నెదఁజల్లుచు వెంటనె యగ్నిహోత్రుండు వెడలెను.

"కోప మ్ముపసంహరింపుము
కోపంబు విడిచి దయగనుగొను ప్రభు"! యనుమన్
వ్యాపించె దివి సురోక్తులు
పాపమ్మదె మదు వహ్నిభస్మముచేసెన్॥ 53

ఇటుల ముక్కంటి మూఁడవకంటినుండి వెడలినయగ్ని మన్మథుని భస్మముచేసి నామావశేషునిఁ జేయఁగా ఇదియంతయుఁ జూచుచున్న ప్రియురాలు రతీదేవి వెంటనె మూర్ఛిల్లెను తనయెదుటనె జరిగిన యీ తన ప్రియుని తీవ్రధిక్కారమువలనఁ బొడమిన-సర్వేంద్రియ వ్యాపారములను స్తంభింపఁజేసిన-ఆమూర్ఛ రతీదేవికి సహింపరాని యాభర్తృనాశ వేదనను తెలియకుండఁజేసి ఒక్క క్షణముమాత్రము ఉపకారము చేసినదివలె నయ్యెను. అంతట సమాధినిష్ఠుఁడయిన, యాభూతనాథుండయిన యీశ్వరుఁడు పిడుగు వృక్షంబునువలె-ఆతపోవిఘ్నమును భగ్నముచేసి సమాధికి విఘ్నమైన స్త్రీసన్నిధానమును పరిహరింపఁ దలఁచి ప్రమథగణంబులతోఁ గూడ అంతర్ధానముపొందెను

ఇటు మిన్నంటుశిరంబుగల్గిన పితృస్వాభీష్ట సౌభాగ్యమున్
ఇటు సౌందర్యముతో విరాజిలి కరంబొప్పారు దేహంబు, న
క్కటా! వ్యర్థంబని యెంచి, యాళుల సమక్షంబందు నిట్టూటము
తక్కటలజ్జంగని శూన్యయై చనె గృహద్వారంబటో గౌరియున్॥ 54

హరుసంరంభముచేత భీతిలి కనుల్ హస్తాలతో మూసి వం
దురు పుత్రిన్ గడు నూరడింప హిమవంతుం డెంతయో ప్రేమచే
దరికిన్ జేరుమకాంచు, దంతములపైఁ దాటించు నాపద్మినిన్
సురమాతంగమువోలెఁ, దాల్చె సుతనచ్చోసాగి యంగాలతో॥ 55

ఇది
మన్మథుని తగులఁబెట్టుట యను
నాలుగవ యాశ్వాసము

# కుమారస్వామి జయము

## నాలుగవ సర్గము

### రతివిలాపము

ఘని దేహస్మృతి లేకయే వివశయైమూర్ఛిల్లు తన్వంగిపైఁ
ఋవు విలాపనికిఁ బ్రాణ, మందములకున్ బ్రోవా రతీదేవిపై
నవ వైధవ్యపు దుర్భరవ్యథ లమాంతంబై వడిఁగూల, దా
టి విధానన్ స్మృతితెచ్చి మేల్కొలిపి తెల్పెన్ తద్దశన్ దైవమే 1

స్మృతిరాఁగా మూర్ఛనుండి తేఱుకొని ఆ రతీదేవి తెఱచిన తనకనులను
బఱపి యొకనైవ శ్రద్ధతో నలువైపుల పరికించెను, తన ప్రియుఁడైన మన్మ
థుని అదివఱకు చూచియు తృప్తిపొందని తనకనులకు - మూర్ఛవలనఁ
బూర్తిగా మూపుపోయిన యామె కనులకు ఆక్షణములో ఏమయ్యెనో
సు-తయును తెలియలేదు, అపుడు

“ఓయీ! ప్రాణేశ! జీవించియుంటె గదవె”
అనుచు లేచినయామెచేఁ గనులయెదుట
భవునికోపాగ్నిచే కాలి భస్మమైన
పురుషరూపమొక్కటే క్షితి నఱయఁబడియె ॥ 2

పిదప మరల విహ్వలయౌచుఁ బృథివినామె
కౌఁగిలించి వక్షమందెల్ల ధూళి యలమ
జుట్టువిడి వెల్లచెదరయి బిట్టువ్రేల
వనిని సమదుఃఖవలెఁజేసి బారుమనియె ॥ 3

“సుకుమారంబయి చక్కనౌ సొగసుతో శోభిల్లు నీదేహమో
సకలంబైన యొయ్యార్ల జాతికుపమానంబౌట ఖ్యాతంబెగా

అకటా! నేఁడది యాక్షణాన నిటు దీనావస్థఁ గూలెంగదే
యిఁక దీనిన్ గనికూడ ప్రేలను జుమీ, యింతుల్ కఠోరల్ గదా ॥ 4

తారగా సేతువుఁ గొట్టి పాఱు జలసందోహంబు క్రొంగ్రొత్త తా
మర పూఁదీవియ విడి పోవునటు, లస్మత్సౌహృదంబున్ త్రుటిన్
మఱువం బోవిడి నీపయిన్ బ్రతుకునంతా మోపి నిన్ నమ్మి యీ
కరణిన్ సోలిన నన్నుఁ బోవిడిచి, యిప్డెందేగినావో ప్రియా! 5

నాకెపుడీవు విప్రియమొనర్చిన పాపము వేయనేరవే
నీకును నే విరుద్ధముగ నేరమునేదియుఁ జేయలేదుగా
నీకయి గోలుగోలుమని నిన్నుఁ దలంచుచు నేడ్చుచుంటినే
నాకయి నీ వకారణము యర్మిలి దర్శనమీయ వేమయా ॥ 6

మఱచితివా! స్మరా! యిటు ప్రమాదమునం బడి నాదు పేరుకున్
మఱియొక పేరు పల్కఁ, దళనన్ దృఢబంధనముల్ పొనర్చుటల్,
దొరలుచుఁ గేసరాలు కనుదోయి బడంగను చూపుజాపుటల్
శిరము నలంకరించికొను నీలపుఁ గల్వల దెబ్బలన్నియున్ ॥ 7

"హృదయములోన నెప్పుడు వసింతువు నీ" వని నాకుఁ బ్రీతికై
యెదివచియించినావో యదియెల్లను మోసమెయంచు నెంచెదన్
అదిమరియాద కోసమయి యన్నదెగాక నిజంబయైన చో
అది యిటు నీవనంగుఁడవె యైనవు డీరతి చావకుండునే ॥ 8

పరలోకంబునకున్ బ్రవాసివయి తేవన్ గ్రొత్తగాఁ బోవు నీ
చరణచ్ఛాయలఁ బట్టి నిన్నుపచరించన్ నేనిదే వచ్చెదన్
మరి యీలోకము నేఁడు దేవువలనన్ వంచించి కొంపోఁబడెన్
నిరతంబెల్ల శరీరులన్ సుఖములన్నీ నీ యధీనంబెగా ॥ 9

నీఁబెంజీఁకటి నీలి మేల్ముసుగులన్ నీకైన పట్నాలన
ర్ధిశలన్ మబ్బులు క్రమ్మి రేగి యిఱుమన్ దిగ్భ్రాంతి భీతిల్లు ప్రే
యసులన్ గాముకులిండ్ల కంపుటకునై యత్నంబుగావించు న
ద్వాళి వీవా కౄఁడవుంటి విప్పుడిక నెవ్వాఁడంపునో యో ప్రియా ॥ 10

పడి నెఱుపు గనుల( దిప్పుచు
నడుగడుగున నడతడ(బడ నదియది పల్కం
బెడి సీధుమదము నీ వి
ప్పుడు లేక విడంబనంబె మోహినులకగున్ 11

బంధుప్రియు(డగు నీమెయి
యందము నామావశిష్టమువుటెఱి(గి యా
చందురుడు శుక్లపక్షము
నందు ననంగః కృశితవిడు నతిదుఃఖముతో 12

ఎఱుపయి యాకుపచ్చనయి యింపగు నాతొడిమల్ వెలుంగ, శ్రీ
కరరమణీయమాధురుల గండగుకోయిలచిమ్మ పూ(త ము
మ్మరమెఱ(గింప, గుమ్మమను మామిడిపూ(తల క్రొత్తగుత్తియె
వ్వారికి(క బాణమైతగిలి బాధలతీయ(గ(బెట్టు( జెప్పుమీ॥ 13

రొదలన్ ఝుంకృతిచేయు తుమ్మెదల మారున్ నీవు పల్మారు నీ
మృదులంబౌ ధనువందు నారిగను స్వేచ్ఛన్ నియోగించి నీ
కెదురేలేనటు రేగి విశ్వవిజయంబేనా(డు సాధింపలే.
దిదె యాతుమ్మెదబారె బాలి రొదతో నేడ్పించునింకన్ ననున్॥ 14

ఇపుడీ వందములొల్కు మేనుగని యుద్రేకమ్మునన్ లేచి-యె
ల్లపుడున్ క్రొత్తగ(దీయ నౌస్వరము లాలాపించుచున్ బన్మని
ద్ధపు(బాండిత్యముచూపు కోయిలను-నిత్యంబెంతొ కోపించి చ
న్న ప్రియుల్ బంటల(గూర్చు దూతిపని-కాజ్ఞాపింపు నే(డో ప్రియా॥ 15

పాదముల( బడిచేయు నీప్రార్థనములు
కడువణంకుచు( బొదువు నీ కౌ(గిళులను
ఆరహఃప్రదేశపు నీ విహారములును
స్మరణకున్ రా(గ స్మర; నాకు శాంతిలేదు॥ 16

రతులన్ బాండితిచూపు నో రతిపతీ! రమ్యంబుగా నీవో యీ
గతి నాయంగములన్ వసంతఋతుశృంగారంపు( బుష్పాలతీ.

ర్చితిపే యయ్యావి నేఁడిదే చెదరకే సింగార, మొయ్యారపుం
డ్యూతు, లొలుకన్ మఱినీదు రమ్యమగుమేనో కానరాదేకదా 17

కుడి పాదంబు నలంకరించి యటుపైఁ గొంచె మ్మసంపూర్తిగా
నెడ పాదంబు నలంకరింప దఱినప్లేతోఁచి ప్రమాయల్ సురల్
వడి నీదారుణ కర్మపాల్పడిరి, యీవామంపుఁ బాదంబునన్
తడి యాలత్తుకపూయి రమ్ము తడవన్ బాలన్ రతీజీవితా॥ 18

అదిగో నచ్చరజొంట్లు కావలయు నీకై వచ్చుచున్నారు పో
అదిగో నేమిడ తుట్టలగ్నఁబడి యిష్టేవచ్చి నీయంకముం
పొదువం జొచ్చి సమాశ్రయింతు ప్రియ! యీపూవిండ్ల క్రీగంటి ప్రో
టుఁదగులొక్కించుఁ బ్రలోభపెట్టఁబడకుండన్ జిక్కకన్ బూర్వమే 19

ప్రియతమ! యెట్టులైనను ని
న్నియుపుడె గలిసికొను దాననే యయినను"స్వ
ప్రియు స్మరు విడి రతి యొకక్షణ
మ యయిన బ్రతికె''నను వాదు మాయదుగాదే॥ 20

పరలోకమరుగు నీకుఁ జి
వరి వీడ్కోలు పుపుదండవైతు నిఁకెట్టుల్
స్మర! జీవితంబె గాకయె
శరీరమును బోయె, నూహనలువనిరీతిన్ 21

కడు శరమ్ము తిన్న చేయుచు
నొడిలో విల్లుంచి నీవు యుక్తుఁడవయి నె
య్యుండగు వసంతునితో న
య్యెడ నగి యను నుడు, లపాంగదృష్టియు నెంతున్॥ 22

పువుమాలలచేఁ గూర్చి, ధ
నువిడిన నీయనుఁగు సఖుఁడును వసంతుం డే
డి వచింపు, మతనికి, మందు
శవుకోపాగ్నిని సఖుగతి పట్టదుగాదే 21

వ॥ అనియిట్లు విలపించు రతీదేవి విలాపవచనములచేత, విషము పూసిన శరీరములచేత వలెఁ, గొట్టఁబడిన వాఁడయి వసంతుఁడు దుఃఖార్తురాలయిన ఆరతీదేవి నోదార్చుటకయి యామె కట్టెదుటఁగనఁబడెను. అంత ఆమె ప్రియుని స్నేహితుఁడయిన యావసంతుని జూచి బొమ్మబాదుకొని యేడ్చెను బాంధవుల దగ్గఱ దుఃఖసముద్రము ద్వారములు తెఱచుకొని పొంగిపొరలిపోవునుగదా. అట్లుమిక్కిలి దుఃఖితురాలై ఆరతియిట్లనియెను.

హేవసంత! నీసుహృదుని కేయవస్థ
సంభవించెనోయీ! మూడు క్షణములోనె
పావురమటు బూడిదరంగు భస్మమిదియు
కణములుగఁ జిమ్మఁబడుచుండె గాలిచేత॥ 22

స్మర! యిపుడె భవదీయదర్శన మొసంగు
మిదిగొ వెంగనుగొనియుండె నీవసంతుఁ,
డెపుడు నరులప్రేమ చలంబయింతులయెడ
స్నేహితులయెడ మాత్రము స్థిరమయుండు॥ 23

ఎపుడునీదు పార్శ్వమున వర్తించువితఁడు
నమరు లసురులుగల జగత్తంతకూడ
తమ్మితూడునారియయి మెత్తనగు పూవు
టమ్ములగుని ధనువువంటి నాజ్ఞనడపు॥ 24

వాయుచే నార్పఁబడిన దీపంబువోలె
నీసఖుఁడీకఁ దిరిగిరాఁడు, నిందుకొన్న
దీపవున్ వత్తినైయుంటి, నైపరాని
వ్యథల పొగల నిండిన నాయవస్థగనుము॥ 25

మదనుఁజంపి, నన్జంపక వదలి దైవ
మర్ధఘాతుక కృత్యంబు నాచరించె
ఏయపాయము లేదని యెంచినట్టి
వృక్షమేన్గుకూల్పఁ, బడు తీఁగియనెయయితి॥ 26

అందుచేత బందుగురాలనైన నాకు
నొక్క యుపకారమును జేయు మోవసంత!
దిక్కులేని నాకిపుడగ్గి తెచ్చిపెట్టి
కాముతోఁ జేర్చు పుణ్యంబుగట్టుకొనుము॥ 27

చంద్రుతోడ వెన్నెలపోవు సంతతంబు
జలదుతోడ మెఱపుఁదీవ సమసిపోవు
అతివలెప్పుడు పతిమార్గమనుసరింతు
రిది యచేతనలు ననుసరించినదియ॥ 28

శుభగమయిన యీ ప్రియు దే
హాభస్మములఁ దికొని బూడిదగు బొమ్మున హ
ర్షభరముతోఁ జని క్రొంజివు
ఱ్ఱాన్పుపయిఁ బోలెననలమున మేనుంతున్॥ 29

పలుమారు మాకుఁ బువుఁ బా
న్పు లమర్చునపుడు సహాయపడితివి సౌమ్యా!
నిలువఁగలే, నిదిగో దో
సిలియిడి ప్రార్థింతుఁ ద్వరగ చితిపేర్చుమికన్ 30

విదవన్ నా మెయి నిడు ని
ప్పుదొరగ దక్షిణపుఁ బవనమున వీచునుమీ
విదితంబెగద నీకున్
మదనుఁడు నేనువిడి క్షణము మనలేఁ డనుమన్॥ 31

ఇట్లుచేసినపిదప మాకిద్దఱకును
జలపు టంజలియొకటి యొసంగవలయు
విడిగ గాకనాతోడ నీప్రియసఖుండు
ఆజలాంజలి పరలోకమందుఁ ద్రాగు॥ 32

పరలోక కర్మచేసెడి
తఱిని వసంత! చివురులు మొదలు మామిడి మం

జరుల నివాపాంజలి యి
మ్మర నీ సఖునకును మావి పూతలు ప్రియముల్ 35

అని యిటు రతీదేవి విలపింపగా నపుడు

కడు హ్రదమెండుతఱి నెగిరి
పడి పడుమత్స్యాంగనఁ దొలివర్షము వోలెన్
ఒడలు త్యజింపఁగ సిద్ధం
బడురతి నశరీరవాణి పడిఁ గరుణించెన్ 36

ఓకుసుమాయుధపత్నీ! సాహసము మానుము, త్వరలో నీ భర్త నీకు లభింపఁగలడు. ఎందుకు నీ భర్త రుద్రుని కంటి మంటయందు మిడతయై మాడిపోయెనో ఆకారణమును వినుము పూర్వము ఒకప్పుడు స్మరునిచేతఁ బ్రేరేపింపఁబడి ప్రజాపతి తన కుమార్తెయందు అభిలాషగలవాఁడయ్యెను. అపుడు ప్రజాపతి తన వికారము నిగ్రహించుకొని నీభర్తను శపించెను. దానికిది ఫలము. ఇపుడు మన్మథుఁడు నశించినచో ఇంక సృష్టి యెట్లు అని ధర్ముఁడని ప్రజాపతిని ప్రార్థింపఁగా "ఎప్పుడు హరుఁడు పార్వతి తపస్సుచే అనురక్తుఁడయి ఆమెను పెండ్లి యాడి సుఖమనుభవించునో అపుడు స్మరునికి స్వదేహము ననుగ్రహించును," అని ప్రజాపతి శాపాంతమును ప్రసాదించెను, ఒక మేఘమునుండియె పిడుగులును అమృతజలమును పడునట్లు జితేంద్రియునుండి శాపములు శాపాంతమిచ్చు నమృతవాక్యములును పడుట సహజముగదా, కనుక ఓకల్యాణీ! నీశరీరమును నశింపఁజేయక కాపాడుకొనుము నీకు నీప్రియునితో సమాగమము కలుగఁగలదు. సూర్య కిరణములచేఁ ద్రాగఁబడి ఇగిరిపోయిన నది మరల వర్షాకాలమున వఱఁదలచే నిండిపోవునుగదా." అనియిట్లు ఒకానొక యదృశ్యదేవత యశరీరవాణి రూపమున పలికి రతీదేవి మరణ ప్రయత్నమును మాన్పింప నపుడు కుసుమాయుధుని యాప్తబంధువయిన వసంతుఁడు విశ్వాసము గలిగించెడి ఓదార్పు వాక్యములచే నామెను ఆశ్వాసించెను." అంత-

కిరణములు పవలు చన ధూ
సరమగు శశి కళ దినాంత సంధ్యను బోలెన్
స్మరుసతి వ్యథ సన్నగిల, నె
దురుచూచుచు వేచియుండె దుఃఖాంతముకై ॥ 37

ఇది

రతి విలాపమను

నాలుగవ సర్గము

—:o:—

# కుమారసంభవము

## అయిదవ సర్గము

### పార్వతి తపస్సుచేయుట

అటులన్ గండ్లకుముందె మన్మథుని భస్మాంతంబుగావించునా
నిటలాక్షుంగని, స్వీయవాంఛ త్రుటిలోనే భగ్నమైపోవ నం
తట నిందించుకొనెన్ మనస్సున స్వసౌందర్యంబు నాగౌరి, యి
చ్చట సౌభాగ్యమెకా ఫలంబు ప్రియులన్ సౌందర్యమున్నందుకున్. 1

ఇటుల సౌందర్యముచే ఈశ్వరుని ప్రేమసంపాదింప శక్యముగాదని యెంచి ఆపార్వతి ధ్యానసమాధిని అవలంబించి తపస్సులచే తన రూపమును సార్థక మొనరించుకొనఁగోరెను. తపస్సులచేఁగాక పతి యర్ధాంగమును పొందఁగల ప్రేమయును, భూతపతినిబోలిన పతియును ఈ రెండు ఎట్లు లభ్యమగును. ఇట్లు ఈశ్వరుని యందు ఆసక్తమైన మనస్సు కలిగి పార్వతి, తపస్సుచేయ నిశ్చయము పూనినదని విని, గొప్పదైన యామునివ్రతము నుండి మరలించఁదలఁచి వక్షస్సుతో నద్దుకొని గౌఁగిలించికొని తల్లియయిన మేనకాదేవి యిట్లు పలికెను.

ఇక్కడ నిండ్లలేరెమదికిష్టమువచ్చిన యట్టి దేవతల్
ఎక్కడఁదల్లి! తీవ్రతప, మెక్కడ నీసుకుమార గాత్రముల్
త్రొక్కక ప్రాలిపై మునరు తుమ్మెదకాలిని సైచుఁగాని, పల్
మిక్కిలి త్రొక్కు పక్షిపద మెత్తనిదిర్సెనపూవుసైచునే. 2

ఇటులఁదెల్పియును ధ్రువేచ్ఛగలుగుపుత్రి
యత్నమునునాపఁగాఁజాలదయ్యెఁదల్లి
ఎవ్వఁడీప్సితార్థ దృఢనిశ్చయ మనస్సుఁ
జల మేగెడి నీరును పైకినడపు

ఒకప్పుడు పట్టుదలగల యా పార్వతి సమయము కనిపెట్టి తన యభీష్టమెఱిఁగిన తండ్రికి సఖులచేఁ జెప్పించి ఫలము సిద్ధించువఱకు తప స్సమాధి నుండననుజ్ఞవేడెను. గొప్పవాఁడైన తండ్రియును తన కుమార్తె కుఁదగిన యా యభినివేశమునకు సంతోషించి మెచ్చి వృత్తి 9 చేయంబొవు తపస్సున కనుజ్ఞయిచ్చెను. పిదప ఆగౌరి తపస్సు చేయుటకై వసించుట వల్ల ప్రజలలోఁ దన పేరుతో ప్రఖ్యాతమై నెమళ్లతో నొప్పు గౌరీశిఖరము నకు వెడలెను.

తమి ముప్పేటలు చిందులాడ నునుగందఁబూడ్చు ముత్యాల హా
రము కంఠంబునఁ దీసివైచియును, పల్చందోయిదావిళ్ల-తీ
ర్ణములై కొంగులు ప్రసక్రు-, బాలరవిఁబోల్ తంగాయ చెంగావి-వు
వ్వుముఁబోల్ మెత్తనివేను కొట్టుకొనిపోవన్ దాల్చె ధీరాత్మయై 4

ఎట్టులు దువ్వెదిద్దుకుదురీయుమ మోమున కందమిచ్చెనో
యట్టులె పుట్టికట్టుజటలామెకు నెక్కు-వయందమే యిడెన్
పట్టిన గండుతుమ్మెదల బారుల చేతనెగాక పద్మముల్
పట్టిన నాచుచేనయిన బాగుగ శోభిలుచుండునే గదా. 5

ఎచ్చోటు-నాగౌరి మచ్చటు ముత్యాల
మొలనూలు - దాలిచి మోదమొందె
అచ్చోట నిత్యంబు గ్రుచ్చి యెఱ్ఱవడ రో
మము లుబ్బ ముప్పేట మోంజిఁదాల్చె
ఏచేయి మోవిని నెఱుపు పూసి స్తనాంగ
రక్తినెఱ్ఱపడు పల్ బంతులాడె
ఆ చేయి దర్భలపోచకోఁతలఁ బుండు
వడియును జపమాల వడిగఁద్రిప్పె

కరము విలువైనపొన్నుల దొరలరాలు
తన కురుల పూల నేయుమ తనువు కందె
ఆపె చేయితీవ తలాడయై పరుండుఁ
గ్రుచ్చుకొనెడి కటికనేలఁ గూరుచుండు 6

మూఁడియెటు కుమారస్వామి కూడఁ దొలుత
జన్మగను వేసిపుత్ర వాత్సల్య ముడుప
నేరఁడో యట్టిమొక్కల గౌరి పెనిచె
ఘటకుచ పయస్సులను పోసి, కడు శ్రమించి 7

నివరిధాన్యపుదోసిళ్ల నిడుచు గౌరి
ముచ్చిక యొనర్ప లేళ్లంత మచ్చికపడె
నంతగా మచ్చిక పడవాయాకు లెదుట
లేళ్ల కళ్లను తనకళ్ల తీలఁ గొలువ. 8

అభిషేకంబులు చేసి యగ్నిని పవిత్రాజ్యాదులన్ వ్రేల్చుమున్
శుభమౌ వల్కల ముత్తరీయముగ సంశోభిల్లఁ బల్ స్తోత్ర స
న్నిభపాఠాదులఁజేయు నాయుమను మౌనీశుల్ గనన్ వచ్చి తా
మభినందింతురు: ధర్మవృద్ధులెడఁ బ్రాయంబేమి వీక్షింతురే. 9

సహజమౌ పూర్వమత్సరము విసర్జించి
 విద్వేషిజంతువుల్ ప్రీతి మెలఁగు
చనుదెంచు పాంథుల శ్రమవాప జలకణా
 ర్ద్రములైన పవనముల్ హాయివిసరు
దారుల కిరుప్రక్కఁదలఁగక నిలుచుండి
 కళ్లతో లేళ్లు స్వాగతములిచ్చు
అరుదెంచు నతిథి కభ్యాగతులకుఁజెట్లు
 పువులఁ బండ్లనర్ఘ్యముల నొసంగు.

క్రొత్తక్రొత్త కుటీరంబులఁ గొసరుమిగులు
నగ్నిహోత్రముల్ మండుచు హవిసు పొగల
వాసనలఁ జిమ్ముచుఁ బవిత్ర పఱచుచుండ
నా తపోవనము ప్రశాంతమయి దనర్చె 10

ఎప్పుడైతే మునుపట్లు చేసిన తపంబీధ్యానమున్ గాని యి
ష్టపు వాంఛల్ నెఱవేర్పఁ జాలవనుచున్ స్వాంతంబు నందెంచెనో

అపుడే గౌరి స్వదేహమార్దవమువై పత్యల్పమేని ల
క్ష్యపుఁజూపుంచక తీవ్రమౌ తపముచేయన్ జొచ్చెనవ్వేళలన్ 11

జంతియాటలోఁగూడనే యింతివాడె
ఆమె మునులవర్తనఁగూడ నధిగమించె
నిజమ యుమమేను స్వర్ణాబ్జ నిర్మితమ్ము
కనుక సహజంబ మృదులము గట్టిదియును 12

నుండు నిప్పులమధ్యఁ గ్రీష్మంపువేళ
గౌరి శుభ్రస్మిత సుమధ్య గూరుచుండి
కనుల నడ్డగించురవిప్రభను జయించి
యన్య దృష్టిలేకయె సూర్యునరయసాగె. 13

అటులు రవికిరణంబుల నతితపించి
ఆమె మోము తామరపూవు నందమొందె
కేవలమ్మామె దీర్ఘమౌ క్రీఁగనులను
నలువు రేకయ మెలమెల్ల నలముకొనియె 14

అడుగకుండ మిన్ననుండి పడిననీరు
విమలరసరూపుఁడౌ చంద్రు వెన్నెలలును
ఆమెకుం బారణావిధి యయ్యెఁగాని
వృక్షవృత్తికంటె మఱొక్కవృత్తి గాదు. 15

నల్గడల మింట మండుచున్నట్టి వహ్ని
నామె పంచాగ్నిమధ్యయై యట్లెయుండి
మండు వేసవి తుదఁగ్రొత్తమబ్బు తడుపు
నుర్వితోఁ గూడఁ బైపైకి నుబ్బఁజిమ్మె 16

మొదటన్ గుర్సిన వానచినుకులు క్షణంబున్ నిల్చి కన్ఱెప్పలన్,
విదపన్ మెత్తని మోవిఁగొట్టి, యటుపైఁ బెన్ మీఱువక్షోజన
త్పదవిన్ వ్రాలుచుఁజిట్టి గౌరివళులన్ బల్మార్ షికార్ చేయుచున్
వదలం జాలక యెట్లొ తుట్టతుదకున్ గంభీర నాభింబడెన్. 17

శిలలన్ బండుచు, లేదె యిల్ సరిగదా, చెట్లేనిలేనట్టిచో
టుల వాసంబుగనుండి, వర్షములు బిట్టున్ వీడకే కుండపో
తలుగాఁబోయఁగ, మధ్యమధ్యను నిశల్ తద్గారి తాదృక్తపం
బులు వీక్షింపఁగ సాక్షులై మెఱపుఁజూపుల్ నించునట్లొప్పెడిన్ 18

ఒడలు కొఱుకు మంచులగాలి వెడలుచుండ
నిండు పుష్యమాసపురేల నీళ్లనిల్చి
చక్రవాకాల కవ పరస్పరము విరహ
మంది యాక్రందనము చేయనరయుఁజాలి, 19

పద్మగంధమొలుకుచు—నిశిన్ వణఁకుచున్న
మోవి చివురాకుతో—మించు మోముతోడ—
మంచువానఁ దమ్మిసిరులు మాయనొప్పు
జలములకుఁ దమ్మిద్యుతికూర్చి సాగెనామె. 20

స్వీయముగనె రాలుపర్ణాల భక్షణంబె
తపసునకుఁ బరాకాష్ఠ; యా తన్వియట్టి
పర్ణములుకూడ వీడి తపంబుచేయ
నాప్రియంవదను అపర్ణయండ్రు బుధులు. 21

తమ్మితూడటు మృదులమౌ తనశరీర
మిట్టివ్రతముల మాడ్చి వాడించివైచి
ఆతపస్వులు కఠిన దేహములఁజేయు
తపములనుగూడ నామె యధఃకరించె॥ 22

ఇటు లా పార్వతి కఠోర తపమాచరించుచుండ శరీరము ధరించి వచ్చిన బ్రహ్మచార్యాశ్రమమో యనునట్లు కృష్ణాజినము మోదుగదండము ధరించి బ్రహ్మమయమైన తేజస్సుతో ప్రపంచము వెలిఁగింపఁజేయు వాఁడువలె నుండి ప్రౌఢవాక్చాతురిగలిగి జటాధారియైన యొక బ్రహ్మచారి ఒకనాఁడు ఆ తపోవనమునకు వచ్చెను. అపుడు అతిథులను సత్కరించు నా పార్వతి బహుమాన పురస్సరమైన సపర్యచేయుచు అతని కెదురు పోయెను. సమస్త ప్రాణులయెడ సమత్వబుద్ధితోనున్న చిత్తముగల వారికి

వపుర్విశేషముగల మహానుభావుల యెడ నాచరించు క్రియలు మిగుల గౌర
వంబు గలిగియుండును గదా. అట్లు యధావిధిగ చేయఁబడిన సత్కార
మును గ్రహించి యొకక్షణకాలము ఆగమనపరిశ్రమను బాపుకొని ఆయమను
ఋజువైన దృష్టితోఁ జూచుచు అవటువు సంభాషణ క్రమము వీడకయిట్లు
అడుగఁ దొడఁగెను.

సమిధల్ దర్భలు హోమకర్మలకుఁ గష్టంబేమి లేకుండ ల
భ్యములౌనే, యుదకాలుగూడ విమలంబై స్నానపానాదియో
గ్యములౌనే, తపముల్ స్వశక్తికొలఁదిన్ గావింతుగాదే, శరీ
రమెయాద్యంబగు ధర్మసాధనము, నిర్వర్తించు సర్వంబిదే. 23

స్వయముగా నీరుపోసి పెంచంగఁబెరిగి
యదరు తీవియలు చివుళ్లు తొడిగెనొక్కొ.
లత్తుకను పూయ మాని చిరంబయయిన
నెఱవుగానున్న నీ మోవి నెవ్విపోలు. 24

చనువుచేఁ జేతిలో దర్భలను హరించు
లేళ్ళపయి నీమదిని నల్క లేదుగాదె
కలువ కనులదాన! యెవి చంచలవుఁగనుల
నీకనులఁ బోలియుండఁగ నేర్చుకొనెనొ 25

రూపం బాచరియింపదు
పాపము" నని చెప్పుమాట పార్వతి! సరియే
నీ పావనమగు శీలమె
తాపసులకును నుపదేశదంబగు సుదృశా!" 26

ఎట్లు నిర్మలములైన నీ పవిత్ర చరిత్రములచేత ఈ గిరిరాజు వంశ
సహితముగా పవిత్రుడయ్యెనో అట్లు సప్తఋషులు చల్లిన పుష్పోపహారములచే
నవ్వుచున్నవి వలెనున్న-స్వర్గమునుండి పడిన—యీగాంగజలములచేఁగూడ
బవిత్రుఁడు గాలేదు ఉత్తమ భావముగల యో పార్వతీ ఇప్పుడు! నీవుఅర్థ
కామములను నీ మనస్సున నంటనీయక ఒక్క ధర్మమునే గ్రహించి సేవిం

ముచు నుంటివిగాన నాకు అధర్మము ధర్మార్థకామములనెడి యీత్రివర్గములో సారముగాఁ దోఁచుచున్నది. ఓ సన్నుతగాత్రీ! నీవు నన్ను విశేషముగా సత్కరించితివి. నన్ను పరునిగాఁ జూచుట యర్హముగాదు, సత్పురుషులకు మనీషులతోడి సాంగత్యము కేవలము ఏడు పదములచేఁ, గలుగునుగాన దానిని సాప్తపదీన మందురు. ఓతపోధనురాలా! నేను ద్విజుఁడనుగానఁ జాపల్యము హెచ్చు, నీవో ఎన్నియడిగినను చెప్ప నోర్పుగలదానవు. కనుక నేను ఒక్కవిషయము నిన్నడుగ నామనస్సు తొందరపెట్టుచున్నది. అది అంత చెప్పరాని రహస్యముగానిచో చెప్పఁ దగుదువు.

జననంబో తొలిబ్రహ్మయంత ఘనవంశంబు నందయ్యె. నీ
తనువా యొక్కెడఁ బ్రోవు వడ్డ త్రిజగత్సౌందర్య సౌభాగ్య, మిం
కను నైశ్వర్యసంగతైతే వెదకంగా నక్కఱలేదు, నీ
వి నవఁబ్రాయము, నింతకంటెఁ దపమేదే నింకసాధించునే. 27

మానవతులకు సహియింపరాని కష్ట
మేదయునఁ గల్గుచో నిట్టివృత్తి గలుగు
నెంత చింతించినను నాదు హృదయమునకు
నట్టి దేదియుఁ గృశోదరీ! తట్టకుండె. 28

ఇట్టి యాకృతి ధిక్కృతి నెనయరాని
దెట్టు లవమానమగుఁ దండ్రియింట సుభ్రు!
చెప్పు పరులు నీపయి చేయి చేసికొంద్రె
సర్పమణి నూచికెవరు చేఁజాపఁగలరు. 29

ఎందుకని ప్రాయమున నగలెల్ల వీడి
కోరి ముసలితనపు నారచీర తాల్తు
విశద చంద్రతారకలొప్పు నిశ మతెప్పు
డేనుదయపు టనూరున కేర్పడునొకో. 30

స్వర్గసుఖము గోరుదువ, యీ శ్రమయు వృథయె
తెలియుము భవత్పితృ భువులు దేవభూము,

లింక వరుని గోరుదువ, చాలింపు తపము,
వెదకునే రత్న; మదె యెందు వెదకఁబడును. 31

నీదు వేడి నిట్టూర్పులున్ దెలుపుచుండె
నాదుమనసా సంశయములో నీదులాడు
ఉఃపు ప్రార్థింపఁ దగువాని నెందుఁ గాన
ఎంక నీవు ప్రార్థింప లభింపఁడెటులు. 32

మురువౌ నల్లని కల్పాలింపగు చెవిన్ జన్నారు నీచెక్కులన్
చిరకాలంబున నుండి చింపిరగుచున్ ప్రేలాడుచున్ నేడు ని
వ్వారిమొల్కల్ కొనలట్టు లీజడలుపస్సైప్పయుండి యల్లాడఁగన్
బరికింపంగల క్రూరుఁ డేయువకుఁ డెవ్వాఁడో గదా యయ్యారే 33

సుంతవంకర కనురెప్ప సొంపు లొలుక
చతురతఁగను నీ కనులకుఁ జాలసేపు
స్వాముఖమును లక్ష్యముగ నొనర్చని యభాగ్యు
నీ ప్రియు సురూప మద దగ్ధునిగఁ దలంతు. 34

గౌరి ! యెంతకాలంబిట్లు కష్టపడెదు,
బ్రహ్మచర్యాశ్రమాప్త తపఃఫలంబు
గలదు నాకున్, దదర్ధ భాగంబుచేత
త్వదభిలాషపొందు, మెఱుంగఁ దలఁతు నతని. 35

వ॥ అని ఇట్లు తనంత తానుగావచ్చి యావటు వడిగినను ఆమె తన మనస్సులోని వరుని గూర్చి చెప్పక తన పార్శ్వమున నున్న సఖురాలి వైపు కాటుక మాటయె యెఱుఁగని తనకనులను త్రిప్పిచూచెను. అపు డా సఖురాలు ఆ వటువుతో నిట్లనియె. "ఓయి సౌమ్యా! నీకు ట్టి కుతూహలమే కనుక ఉన్నచో వినుము' వేడి యెండను నివారించుటకై తామరపువ్వును గొడుగుగా పట్టినట్లు ఈమె తన తనువును ఎందుకై ఇట్టి కఠోరతపమునకు సాధనముగాఁ జేసెనో చెప్పెదను, అమితైశ్వర్యముగల నలువురు దిక్పాలురను త్రోసివైచి మన్మథుని భస్మము గావించుట వలన రూపసౌందర్యముచే

హరింపరాని పినాకపాణిని ఈ మానవతి పతిగా పొందఁగోరుచున్నది. పూర్వము సహింపరాని రుద్రుని హుంకారముచే మరలి పుష్పాయుధుని మూర్తి నశించిపోయినను ఆ మన్మథుని పూవు ముల్కికొన పురరిపుని సోకక వెనుకమరలి హృదయమున లోతుగా గ్రుచ్చుకొని ఈమెను బాధ పెట్టెను.

అదియే యాదిగఁ దండ్రియింటహరుపై నత్యంతమున్ బెంగతో
నుదుటన్ గందపుఁ బూఁతలన్ మురికివై నున్ముంగురుల్ వ్రేలఁగన్
మదిలో గ్రుక్కుచు, ముద్దగట్టి శిశిరంబౌ మంచుబావేదులన్
ఐదె పన్నెండియు నీమె పొందదు సుఖం బావంతయే నెప్పుడున్. 36

భవుని త్రిపుర జయాదులు పాడుతఱిని
గద్గద గళానఁ దొట్రిల్లి కదలునుడులఁ
జాలసార్లీమె సంగీతసఖులఁ గిన్న
రేశకన్యల మివులనేడ్పించె వనిని. 37

ఈమె రాత్రుల తెలవాఱుజామునందు
క్షణము కన్నులు మూసి మేల్కనుచు వేగ
"ఓయి నీలకంఠా! యెందుపోయె" దనుచు
వట్టిమెడలోనఁ జేతులువైచి గ్రుచ్చు 38

"ఈవు సర్వగతుఁడవని యంద్రుబుధులు
ఈ వానినుఁగోరు నీమెను నెఱుఁగవైతి"
యనుచు నీ ముద్దరాలు రహస్యముగను
వ్రాసి చంద్రమౌళిని దూఱివగచుచుండు. 39

ఇంకనా జగత్పతిఁబొందు నేయుపాయ
మెఱుఁగకుండుట విధిలేక యీమె యిట్లు
జనకు ననుమతిపొంది యీ వనమునకును
వచ్చి మాతోడఁగూడి తపస్సొనర్చు. 40

ఈమె స్వయముగఁ బాతి పోషింపఁ బెరిగి
యీ తపమునకు సాక్షులౌ వృక్షములను

గాయగాచి ఫలించునుగాని, సఖికి
హరునిపయి గోర్కెయె మొలకయైనఁ గనదు. 41

తపములంజికిఁ, గన్నీళ్ల తడవుచుండ
సఖులచేఁ జూడఁబడెడి మాసఖిని కోర
దొరకని హరుండెపుడు దయనరయు నెఱుగ,
వానలేకెండు నాగేటి వానవోలె. 42

శైలసుత భావమెఱిఁగిన సకియ యిట్లు
స్ఫుటముగాఁ దెల్ప నైష్ఠిక సుందరుండు
ఓసి! యింతేన మఱి పరిహాసము! అని
తనముదముగాన రానీకయనియె నపుడు. 43

వ॥ అట్లు అనుటయు వేళ్ళ ముడుచుకొన్నముంజేతిలో స్ఫటికముల రుద్రాక్ష మాల నుంచికొని ఆ గిరిరాజపుత్త్రి చాలసేపటికి ఎట్లో మాటలు తెచ్చుకొని మితాక్షరములతో నిట్లనియె "ఓయి వేదవిద్వరా! నీవు విన్నదంతయు సరియె ఈ జనము మహోన్నతపదవి నధిష్ఠింప నుత్సుకురాలై యున్నది. ఈతపస్సంతయు అందుకే. కోరికలకు పొందరానిదన్నది లేదుగదా. అని యనఁగా నా కపట బ్రహ్మచారి యిట్లనియె"

తగని వస్తువుకై పట్టుదలవహించు
గౌరి! పెండ్లి పసుపుత్రాడు గట్టు నీది
చేయి యిది, పాముచుట్టిన శివుని చేయి
యిదె మొదలుగఁ గ్రొత్తగ గ్రహించి యెటులసైచు. 44

పోని న్యాయముగ నిదె తలపోయు మీవె
కొదమయంచ లద్దిన పెండ్లికూతు వలువ
కాలు నెత్తుటి మక్కల గజపుతోలు
ఇవ్వి రెంటి కొప్పునె యోగమెప్పుడేని. 45

నాలుగిండ్ల భవంతుల-పూలపైని
నడవఁదగు నీదుపారాణి అడుగుకాళ్లు

శవపువెంట్రుకల్ చెదరు శ్మశానవాటి
నుంచుటకుఁ బగవాఁడేని యొప్పుకొనునె. 46

విషమనేత్రు కౌఁగిలి లభింపవచ్చుఁ
గాని యింతకంటె నయుక్తమైనదేది
మంచి గంధపుఁ బూతల మించు మేన
నాతఁడింత బూడిదను బూయంగలండు. 47

అది నీకిక నొక యుపహాస్య మొసఁగు
పట్టపేనుఁగెక్కందగినట్టి నీవు
భవుని యా ముదుసలి యెద్దుపైని నెక్క
నవ్వుకొంద్రు నిన్నుఁగని జనంబులెల్లఁ. 48

పలు కళల చంద్రునికళతోఁ బాటెయింక
ఈ భువన నేత్ర కౌముది నీవుగూడ
వికృత నేత్రుని మీఁది కోరికనుబట్టి
జాలిపడఁదగు దానవై గ్రాలుదువుడు. 49

మేనొ విషమాక్షము; కులంబొ కానరాదు;
ఆ దిగంబరు భాగ్యంబొ యఖిలవిదిత;
మరయు బాలమృగాక్షి! యావరుల వెదుక
దగినదొకటేని ముక్కంటిఁ దనరె నొక్కొ. 50

పనికిమాలు కోరికనుండి మనసు త్రిప్పు
మట్టివాఁడేడ! నీవేడ! యమలగాత్రి!
శ్రుతి విహితమైన సత్క్రియన్. సుజనులెందు
ఆ శ్మశానశంకునకు నాచరింత్రె॥ 51

## పార్వతి వటువునకు హరుని మహిమతెల్పుట

వ॥ అని యిట్లా ద్విజుండు ప్రతికూలముగా పలుకగా, నదురుచున్న యధరముచే దనలోని కోపము వెల్లడి చేయుచు నా పార్వతి, కనుబొమ్మలు వంచి కనుగొలంకు లెఱ్ఱవడ నా వటువుతో నిట్లు అనెను.

ఇటుల నీవన్న పలుకుల నెంచిచూడ
హరుని సరిగ నీ వెఱుగమి యెఱుకపడియె
ఎందసామాన్యమై, హేతు వెఱుగరాని
యా మహాత్ముల చరిత-ద్వేషింత్రు జడులు॥ 52

ఆపదలకు ప్రతిక్రియ నరయువారు
కోర్కె గలవారు శుభముఁ గోరుదురు
ఆశ లేక జగద్రక్షయైన భవుని
కిట్టి యాశోపహత చిత్త వృత్తులేల॥ 53

ఏదియు లేని వాడయ్యు సంపదలకిల్లు,
కాటినుండు నైనను, త్రిలోక ప్రభుండు
భీకరుండయ్యు శివుడని పిలువబడును
ఆ పినాకి యాథార్థ్యము నరయలేరు॥ 54

పెట్టుకొనెనో భూషలు, పాము చుట్టుకొనెనో
దువ్వలువ గట్టునో యేన్గు తోల్ వయిచునో
పుఱ్ఱె తాల్చునో శశికళల్ పూసికొనునో
ఎదో విశ్వాత్ము మెయి నిశ్చయింపలేము॥ 55

అతని మేని సంపర్కంబు నందికాదె
కాటిబూడిద మంగళకరమెయయ్యె
అరయు, నృత్యాభినయముల నవనిఁ బడిన
బూడిదనో దేవతల్ మౌళి బూసికొందురు॥ 56

సంపదలు లేక, యెద్దుపైఁ జనుచున్న
భవుని కాళ్ళపైఁ దన మౌళి వాల్చి వేళ్ళ
విరియు మందార సుమధూళి నెఱుపుచేయు
మత్త దిగ్గజ మెక్కిన మఘవుడెపుడు॥ 57

చెడిన యాత్మగలుగు నీవు శివునిపైని
చెడ్డ చెప్పుమును నిజంబె చెప్పినావు

ఎవనిని స్వయంభువునకు హేతువంద్రో
యతని పుట్టువు నెవరైన నరయగలరె॥ 58

పోని యిటు వివాదంబేల స్థాణుగూర్చి
యెటుల నీవు వింటివదెల్ల నట్టె యవుత
నాదు చిత్తంబొ తద్భావమయమె యయ్యె
ఎందు స్వేచ్ఛాచరులు పరునింద గనరు॥ 59

ఇతని సఖి! ఆవు నీ వటుండింక నేదొ
కదుపదలచి పై పెదవిని మెదపుచుండె
ఎత్తఁడిటు మహాత్ములదూఱు నతడె గాక
వాని నిందలున్ వినువాడు పాపి యగును॥ 60

పోనిలే నేను యిటనుండి పోదు ననుచు
బాల కదలె బయ్యాట నారబట్టుబాలు
అంత శివుడు చిర్నవ్వులు దంతకాంతి
మఱియు మెరయింప నా గౌరికరము పట్టె॥ 61

అతనిన్ జూచి వణంకుచున్ గిరిజ శావైక్ల్యంబునన్ జెమ్మగి
ల్లు తనూవల్లికతోడ, పోవుటకు గాలున్ బైకివే యెత్తి యా
గతి నిల్వంబడి—కొండయడ్డుపడ మార్గంబందు, వెన్వెన్కవై
పు తటాల్నన్ దిరుగాడు పెన్నదివలెన్ బోలేదు నట్లుండదున్॥ 62

నేటినుండి వినమ్రాంగి! నీకు దాసు
డయితి; నీదీక్ష నను కొనివయిచె ననుచు
శశిధరుడన గౌరియు దపశ్శ్రమను బాసె
శ్రమ ఫలింప నదె మఱి నూత్నముగమాఱు॥ 63

ఇది

అయిదవ సర్గము

# కుమారస్వామి జయము

## ఆరవ సర్గము

### హరుఁడు హిమవంతునిదగ్గరకు సప్తఋషులఁ బంపుట

వ॥ అంత పార్వతి విశ్వరూపుడైన శివునికి "పర్వతాధిపతి యయిన తండ్రి హిమవంతుడు కన్యాదానము చేయునట్లుగా ననుగ్రహింప వలయు" నని సఖిచేత సందేశమంపెను.

ఆమె సఖిచేత సందేశమంప మదిని
ప్రియునియెడల నిశ్చలు రాలెయయి వెలింగె
దరి వసంతుని గని మెచ్చి విరియబూసి
కూయు కోయిలచే మావికొమ్మవోలె॥ 1

అంత నాస్మర శాసనుండట్టె యనుచు
మాటయిడి, మెట్లో యుమవీడి, మనసులోన
సరిగ జ్యోతిర్మయులయిన సప్తఋషుల
సన్నిధికిరాగ స్మరియించె సత్వరంబ॥ 2

ఆ తపోధనులంతట నాకసమును
స్వీయ తేజస్సుతో విరాజిలగఁ జేసి
యా క్షణంబ యరుంధతి తమ్ము ననుసరింప
నరుగుదెంచి మోకరిలిరి హరునిముందు॥ 3

తీర మందార పూల్ మీఱి దిగ్గజ మద
గంధియౌ సురగంగయందు మునిగి
ప్రస్రవించు సురద్రుమలటు హేమ వల్కలా
క్షమణి మాలలు ముత్తె జందెమూని
క్రింది శాఖములంటి కేతువు శిఖవంచి
పూష సాక్షాత్తుగ మ్రొక్కిచూడ

ప్రళయాన నుద్ధరింపఁ బడిన ధరతో మ
హావరాహపు దంష్ట్రి నాశ్రయించి
సృష్టి విదప, బ్రహ్మ విదప నెల్ల జగము
పూర్వ సృష్టి కర్తలనుగఁ బొగడుచుండ
ప్రాక్తన విశుద్ధ తపములు పండ
ఫలముల ననుభవింత్రు సప్తర్షు లెపుడు॥ 4

అట్టి సప్తర్షులకు మధ్యాయందు నిలిచి
సాధ్వియా నరుంధతి భర్తృ చరణపద్మ
యుగళిఁ జూపుంచి సాక్షాత్తె యుదయమైన
యా తపస్సిద్ధివలె కడు నలరుచుండె॥ 5

వ॥ అపుడా యీశ్వరుండు ఆ యరుంధతిని కొంచెమును భేదము లేకుండ సప్తర్షులతో పాటు, గౌరవముగా జూచెను. ఈమె స్త్రీయని వీడు పురుషుఁడు అన్నది గౌరవము చూపుటలో ప్రమాణ మేమాత్రమునుగాదు. సజ్జనులకు సత్ప్రవర్తనమె పూజింపఁదగినది. ఆ యరుంధతీ దర్శనమువలన శంభునకు భార్యా స్వీకారము విషయమై ఆదరమెక్కువయ్యెను. ధర్మయుక్తమైన క్రియలకు పతివ్రతలగు స్త్రీలే మూలకారణము గదా. పార్వతిని గూర్చి ధర్మయుక్తమైన భార్యా స్వీకరణము నీశ్వరుఁడు గ్రహింపఁగా నదివఱకు చేసిన యపరాధముచేత భయపడిన మన్మథునకును మనస్సులో ఊరట కలిగెను అంత సాంగవేద ప్రవక్తలైన యా మునులందఱు జగద్గురువైన యా యీశ్వరుని పూజించి సంతోషముతో పులకితగాత్రులయి యిట్లనిరి.

## సప్తర్షులు హరుని స్తుతించుట

అనయ మొనరించు వేదాధ్యయనములకును
అగ్నిలో యథావిధి వ్రేల్చు నాహుతులకును
ఎప్పుడు నిష్ఠతోఁ గావించు తపములకును
నేఁడు గద లభించె ఫలంబు నిన్నుఁగాంచ॥ 6

సువిహిత కర్మలు పండెను
భువనేశుండవగు నీ విపుడు మముఁదలచి యె

ట్టివయిన వాంఛల కందని
భవద్ధృదయ పీఠి నిల్పు భాగ్యంబిడుటన్॥ 7

ఏ నరుఁడు నిన్నుఁ దలఁచునో
యా నరుఁడే ధన్యులందు నగ్రేసరుఁడై
యైనపుడీఁక బ్రహ్మమునకు
యోచివి నీవు దలఁచు నరు నూహింపేడిదే॥ 8

నిజముగ మేమరుగని కం
టెఁ జంద్రుకంటె నీఁకఁబైన నెగడుదు మైనన్
అజుఁడవు నీవు దలఁచి ద
యఁ జూప పైకరిగితి మన్నిటికంటెన్ 9

ఆత్మ మమునెంచి మన్నించి నందు వలన
ఎందు మము మేమె మన్నింపు కొందు మెప్పుడు
ఉత్తములు మన్ననలు చూపు చుందు రపుడు
స్వగుణముల యెడ తఱచు విశ్వాస మొదవు 10

ఓవిరూపాక్ష! మమ్మిట్లు నీవు తలఁప
నెంత సంప్రీతి గలిగెనో యిప్పుడద్ది
నీకు వచియింపఁ గలుగుము మెట్లు? తెలియు
దఖిల జీవుల కీవంతరాత్మవు గద॥ 11

భర్గ! సాక్షాత్తుగాఁ జూడఁ బడితి విపుడు
నిన్ను మేము వాస్తవముగం దెలియలేము
ఇదె యనుగ్రహముంచి నిన్నెఱుఁగఁ జెపుము
ఇందు మా బుద్ధి పథములఁ కందనీవు॥ 12

దేనితో నీవు వ్యక్తాకృతిని సృజింతు
దేనితో మఱి నీవు దానిని భరింతు
సరియె మఱి దేనితో దాని సంహరింతు
ఇందులో నేది నీభాగ మెఱుఁగఁ దెలుపు॥ 13

పోనిలే దేవ! గొప్పదై పొలుచునిట్టి
చిందు ప్రార్థనయట్లులే యుండనిమ్ము
ఈవు తలపోసినందుచే నేగుదెంచు
నట్టి మేము చేయునదెదో యానతిమ్ము॥ 14

## హరుఁడు సప్తర్షులను హిమవంతునిదగ్గరకు పంపుట

వ॥ ఇట్లు ఆ ఋషులు విన్నవింపఁగ విని యా పరమేశ్వరుండు తన శిరస్సునందలి చందురుని సన్నని వెన్నెల రేకల కాంతిని తన విమలమైన పలువరుసలకాంతి కిరణములచే సింకను వర్ధిలఁ జేయుచు నిట్లనియె.

మీర యెఱుఁగుదురే కదా మేము చేయు
పను లెవియు స్వార్థయుతము గావనెడి మాట
నా యెనిమిది మూర్తులచేత నా ప్రవృత్తి
యిట్టిదని సూచితమయంచు నెఱుఁగు జగమె॥ 15

దప్పికలచేఁ బొగిలి జలదమును దమిని
గాంచి కడు వృష్టికై చాతకము వోలె
రాక్షసులచేతఁ గష్టముల్ పడయుచున్న
సురలు, యాచింత్రు సంతతికొఱకు నన్ను॥ 16

ఇందుచేత సంతానంబు పొందుకొఱకు
పార్వతిని స్వీకరింప భావమునఁ దలఁతు
హావిసు భుజియించు నట్టి యా యగ్నికొఱకు
అరణిని యజమానుఁడు పొందునట్లు లిపుడు॥ 17

కనుక మాకై హిమాద్రి దగ్గరకుఁ బోయి
పార్వతిని మీరు యాచింప వలయు నిపుడు
ఎందు సుజనులు చేయు సంబంధ విధులు
నెంత మాత్రము విక్రియ చెంతఁబోవు॥ 18

వ॥ ఉన్నతుఁడును స్థిరుఁడును సకల భూభారమును వహించువాఁడును నగు హిమవంతునితో సంబంధమునుగోరు నేనును వ్యామోహములేని కృతార్థుఁడ ననియు తెలిసికొనుఁడు.

ఆ(ద్రితోఁ గన్యకొఱకిట్టు లనఁగవలయు
ననుచు మీకిప్పు డుపదేశ మనవసరము
మీ సదాచారములె (శ్రుతి స్మృతులె యనుచు
సజ్జనులు చెప్పుచుందురు గాదె యెపుడు॥ 19

ఆర్యులారా అరుంధతికూడ నచటి కేగి
యవసరమగు సాయము చేయ నర్హురాలు
తఱచుగా నిటువంటి కృత్యములయందు
ఈదృశ పురంధ్రులె (ప్రగల్భలై దనర్తు॥ 20

కనుక దేవకార్యము సిద్ధికయి హిమాద్రి
దరికి నోషధి (ప్రస్థాఖ్య పురికిఁ జనుఁడు
ఈ మహా కోశినది పడు భూమి దరిని
మరల మనకు సమాగమ మగునుగాక॥ 21

అఖిలంబౌ యములందె య(గసరుఁడౌ నాశర్వుఁడే పెండ్లి, కు
న్ముఖుఁడై పోవఁగ, లెక్కయేమి మనకన్నచ్చన్, (బహ్మ సంతానమై
నిఖిలా దర్శ్యులెయైన సప్త ఋషులున్-గేహస్థులై (స్త్రీని స
న్ముఖ ధర్మాంగిఁగనైనఁజేసిన (తపన్ వర్ణించి నా రత్తఱిన్॥ 22

వ॥ పిదప 'సరె అట్లె' అని యా సప్తర్షులు ఓషధి (ప్రస్థపురి వైపుగా బయలుదేఱిరి. భగవంతుండగు శంకరుండును ఇదివఱకుఁ దానున్న స్థానమునకు చేరెను.

## ఓషధి (ప్రస్థపుర వర్ణన

ఆ మహర్షులును మనోవేగముతో కరవాలమువలె నీలమైన యాకాశమున కెగిరి యోషధి (ప్రస్థ పురమును చేరిరి. ఆ పట్టణమో—

(మోగుచు పొంగుగాంగలహరుల్ పురినల్గడఁ గందకంబులై
తూగుచుఁ గొండ పెంధరులఁ దోగుచు యౌషధులుం వెలుంగులై
బాగుగఁ బెద్దకెంపుగమి (ప్రోవయి కోటకు గోడయైతగన్
ఈ గతిఁ (బోలు రక్షణల నెంతయు నిండియు రమ్యమే యగున్॥ 23

అట జన్మించిన యేనుఁగుల్ దుమికి సింహాలన్ జయించున్ ద్రుటిన్
అట నేర్పడ్డ బిలంబు లుత్తమములౌ నశ్వాల పుట్టిండ్లె య
చ్చటి యా పౌరులు సిద్ధ కింపురుష యక్షాదిత్య గంధర్వులే
అట స్త్రీలో వనదేవతల్ గృహములో యందాల మబ్బుల్ గుహల్। 24

హిమ శృంగంబుల వ్రాలు మబ్బు తెరతో నింపారు నా యిండ్లలో
ని మృదంగధ్వని, మేఘ గర్జనల సందేహంబు తోపింపఁ దా
శము, లింపౌలయలున్, బయల్ వెడలి సుశ్రావ్యంబులై యొప్పు భా
వములం బుట్టిన సంశయంబులను మాపంజాలు నవ్వీటిలో॥ 25

పురజను లాదరమున నే
ర్పఱచకముందె, చిఱుగొమ్మలఁ గదలు చీనాం
బరయుత సురతరులె మం
దిర దారువుల ధ్వజలక్ష్మిఁ దీర్చును బురిలో॥ 26

అందు రాత్రుల స్ఫటిక హర్మ్యముల యందు
పానగోష్ఠి ప్రదేశాలఁ బ్రకట గతుల
ద్యుతులఁ జిమ్ము నక్షత్రములు ప్రతిఫలింప
పువ్వుల యుపహారమ్ముల పోల్కి మెఱయు॥ 27

రాత్రులను గూడ మబ్బులు క్రమ్మియందు
దుర్దినాల్ చేసినను నోషధులు వెలుంగ
ప్రియులఁ గలయ నేగు నభిసారికలు, గతులు
బట్టబయలు కాఁగ నెఱుఁగ రెట్టితమము॥ 28

జవ్వనమె కాని యాపురిన్ జరయె లేదు
సుమశరునికంటె నట వేఱె యముఁడు లేఁడు
స్మృతి యెఱుఁగక పడియుండు స్థితియు నచట
ప్రియులు విహరింప మైమఱపించు నిద్ర॥ 29

కనుబొమలు ముడిచి పెదవులు కదలుచుండ
నునువు మెత్తని వ్రేళ్ళ తర్జనలొనరిచి

కనరి యుల్కి కామిను లనుగ్రహము చూపు
వఱకుఁ జేయుదురటఁ బ్రియుల్ ప్రార్థనములు॥ 30

కల్పవృక్షాల నీడ నంగములు మఱచి
యటఁ బరుండు విద్యాధర యాత్రికులకు
నవల నెత్తావు లొలికించి హాయిగూర్చు
యొప్పు గంధమాదనగిరి యుపవనములు॥ 31

వ॥ అట్టి హిమవంతుని పురమును ఆ మునీశ్వరులు కనుఁగొని స్వర్గము నకై తపములుచేసి సంపాదించిన సుకృతంబును తమ వ్యర్థ ప్రయత్నముగఁ దలఁచిరి. చిత్రమునందలి యగ్నిహోత్రంబులు వోలె నిశ్చలులై జటాభారములుగల యా సప్తఋషులు వేగముగా ఆ గిరిపురమును ముఖము లెత్తి ద్వారపాలకులు చూచుచుండఁ బ్రవేశించిరి.

ఎంచి పెద్దలముందుగ నుంచికొనుచు
ఆకసమునుండి దిగెను సప్తర్షిపంక్తి
జలములోఁ బ్రతిబింబించి యలరుచుండి
భాస వెదఁజల్లు సూర్యుల పంక్తి వోలె॥ 32

కడు సారముచే గురువౌ
నడుగుల నుంచుచు నడకల నుర్విని హిమవం
తుడు వంచుచు నర్ఘ్యము ముం
దిడి దూరమునుండె వారి కెదురేగె వడిన్॥ 33

జేగురురంగధరముతో
బాగ పెరుగు దేవదారు బాహావళితో
వ్రేగగు ప్రకృతి శిలాహృది
రాఁగ హిమాద్రియె యతఁడని ప్రకటంబయ్యెన్॥ 34

విధియుత సత్కారపు స
ద్విధు లొనరించి స్వాయముగఁ బథిని జూపుచు నా
ప్రథిత సుకర్ముల సంయమ
నిధుల వడిఁ బ్రవేశపెట్టె నెఱి నంతిపురిన్ 35

అందు వేత్రాసనంబుల సర్వ ఋషుల
గూరుచుండ బెట్టియు దాను గూరుచుండి
క్షితిధరేశ్వరుడు దోసిలి మొగిడ్చి
వినయ నమ్రుడై వారితో ననియెనిట్లు॥ 36

## హిమవంతుడు సప్తర్షులను వచ్చిన కార్యమడుగుట

అనుకొనకయె మీరిట్లు
చను దెంచుట మబ్బులేక జలములు కురియు ట
య్యెను, పూవులు పూయకె చె
ట్లును గాయలుగాచి పండుటయ్యెను దలపన్॥ 37

ఇటుల మీరనుగ్రహము చూపుటను బట్టి
మూఢుడను జ్ఞానవంతుని బోలినట్లు
మది నయోమయుడ స్వర్ణమయుడ బోలె
నవనినుండి స్వర్గము నెక్కినట్లు తలతు॥ 38

ప్రాణుల నికనుండియె పవిత్రమ్మొనర్ప
జేరగా దగ్గవాడనై పేరుగాంతు
ఎట మహాత్ములు పాదంబులిడి చరింత్రొ
దానినే సర్వజనులు తీర్థంబులంద్రు॥ 39

నాకనది నెత్తి బడుచున్
మీ కాళ్ల గడిగిన నీళ్ళు నెత్తిని దాల్పన్
నాకాయము పూతమ్మయి
నాకీ జన్మము సఫలమయి దనర్చెను రెంటన్॥ 40

వ॥ రెండు విధములుగానున్న నా శరీరముకూడ అందలి జంగమరూపము మిమ్ము సేవించుటకును వరరూపము మీయడుగుల క్రింద అంకితమై యుండుటవలన విభజింపబడి మీ యనుగ్రహము కలది యయ్యెనని తలంచెద. ఇట్లు మీ యనుగ్రహంబున బొంగిపోయిన సంతోషముతో నిండియున్న నా యంగములు దిగంతములవఱకు వ్యాపించియుండియు ఇంత ప్రపంచములో గూడ

నిముడరానివై యున్నవి. బ్రహ్మతేజస్సుతో వెలుంగు మీ దర్శనభాగ్యము చేతఁ గేవలము నా గుహలలోని తమస్సేగాక యీరజోరూపుఁడనైన నాలోని యజ్ఞానముగూడ అంతరించి పోయినది. నేనేదైన చేయవలసిన దన్నదుండు నని యనుకొనను. ఆట్టిది ఎట్లు సంభవించును, మీరిక్కడకు వచ్చుట నన్ను బవిత్రునిఁ జేయుటకే యని యనుకొందును. అయినను ఏదైనను కొంచెము ఆజ్ఞాపింప మీరు అర్హులరు. సేవకులెప్పుడు ప్రభువులై యుండువారియెడ ఏదైన నియోగించుటయె యనుగ్రహముగా గలవారై యుందురుగదా. ఇదిగో మేమిక్కడ మీయాజ్ఞ నెఱవేర్ప సిద్ధముగా నుంటిమి. ఈమె నా భార్య మా కులమునకు జీవితమైన కన్యయిదిగో. చెప్పుఁడు ఏది మేము చేయవలసి యున్నదో. మీకు బాహ్యవస్తువులందు ఆస్థలేదు గదా, అని యిట్లు హిమాలయుండు వచియించుటయు, దానినే మరల గుహయందు వ్యాపించిన ప్రతిధ్వనిచే రెండుసార్లు హెచ్చరించిన వాఁడువలె నుండెను. అంతనా ఋషివర్యులు ఆలకించి చెప్పవలసిన విషయములను సందర్భోచితముగాఁ జెప్పువారిలో అగ్రగణ్యుఁడైన యాంగీరసుని కార్యము నివేదింప ప్రేరేపింప నపుడాతఁడు శైలరాజుతో నిట్లనెను.

## ఆంగీరసఋషి హిమవంతునితో నతనిపుత్త్రి పార్వతిని హరునికిచ్చి వివాహము చేయుమని చెప్పుట

ఇది యెల్లన్ నీకుం దగి
నదియేయగు, నింతకంటె నయినను నీయం
దధికమె సుమి యెట్లన నీ
మదివలె నీ శిఖరములును మఱి యున్నతముల్॥ 41

స్థావర రూపుఁడవగు ని
న్నా విష్ణువుగా వచియించు రది సత్యంబౌ
నీవో సచరాచర భూ
తావళికిన్ గుక్షివగుచు నాశ్రయము గదా॥ 42

నీ వెకనుక భూతల మూ
లావధి దాకను క్షితితలి కాధారమవై

కావేన్ శేషువెటు మృదు ఫ
ణావళితో భువి ధరింప నగునో చెపుమీ॥ 43

ఎడతెగని యమలపూరం
బడర సముద్రపు టలలటు లడ్డబడకయే
వెడలుచు నాకీర్తులు నదు
లదరి పనులయి భువనముల ననఘమొనర్చున్॥ 44

పరమేష్ఠియైన విష్ణువు
చరణమున వెడలి యెటు గంగ శ్లాఘింపఁ బడెన్
ఇరుజన్మను నెత్తగ నీ
శిరమున వెడలి యది గంగ శ్రేష్ఠమెయయ్యెన్॥ 45

దివిపై బ్రక్కలఁ గ్రిందం
ద్రివిక్రమత యత్నమున నిండిన హరి కె
ట్టి విధమగు మహిమగల దా
ప్రవర మహిమయైతె నీకు స్వాభావికమే॥ 46

క్రతుభాగము పొందెడు దే
వతాళి మధ్యమపదంబు పడసిన నీచే
అతియెత్తగు మేరుగిరి యు
చిత హేమశిఖరము వృధగఁ జేయంబడియెన్ 47

స్థావరమగు దేహంబున
నీవు సమస్త కఠినతయు నింపితి వింకన్
ఈవిమల భక్తి నమ్రం
బౌ వపువౌ సుజనుల పూజ కుపయుక్తంబౌ॥ 48

ఏది అణిమాది సిద్ధులు గలిగి, యింకొక పురుషుని సోకక, అర్ధ చంద్రరేఖతో శోభిల్లి, ఈశ్వరుఁడనెడి గొప్పపేరు పొందియున్నదో

ఏది పరస్పరము కలిసిన సామర్థ్యములు గల భూమి మొదలైన యష్టమూర్తులతో—ధరింపఁదగిన యీ విశ్వమునంతను మార్గమందు రథము వలె ధరించుచున్నదో

ఏది సర్వక్షేత్రంబు లందుండి. యోగులచే లోలోన నన్వేషింపఁ బడుచు, జన్మింపెదమను భీతిలేని మోక్షపదవిగా మనీషులచేఁ జెప్పఁబడు చున్నదో

అట్టి యాదిశక్తి సమస్త విశ్వముల కర్మలకు సాక్షియై పరము లొసంగెడి శంభుఁడు మాయందు సంక్రమించిన మాటలతో నీ పుత్రిని సాక్షాత్తుగా వర్ణించుచున్నాఁడు

అర్థమును వాక్కుతోఁ జేర్చ నతని నింక
నీ క్షమార్తితోఁ గలుపఁగ నీవ తగుదు
తగిన భర్త హస్తంబునఁ దనదు కన్య
నప్పఁజెప్పి తండ్రి యశోచ్యుఁ డగును గాదె 49

స్థావర జంగమము లయిన
యీ విశ్వము లందు వెలయు నెల్లను ప్రాణుల్
భావించు నీమెఁ దల్లిగ
నీ విశ్వములకుఁ బితగదె యీశ్వరుఁ డెపుడున్ 50

మొదటన్ శితికంఠునకు వి
బుధులు నమస్కారములను బొనరించియునా
పిదప నీమె పదాబ్జము
లఁదమ శిరోమణులచేత రంజించెడుతన్ 51

ఉమ వధువు, నీవు దాతవు
ఉమ నడిగెడి యాచకులుగ నుంటిమి మేమో
ఉమకు వరుండో శివుఁడు, ని
విమల కులము వృద్ధికొఱకు విధియిదె వెలయున్ 52

స్తుతియింపఁబడు, స్తుతింపఁడు;
నతులొనరింపఁడు జగములు నతులొనరించున్
సుత నిడు సంబంధముచే
సతము జగద్గురు గురుఁడయి శ్లాఘ్యుఁ డగును సుమీ 53

## మేనకాహిమవంతుల సంగీకారమును ఋషులుశివునికి విన్నవించుట

సురముని యిటు వచియింపన్
తరుణి పార్వతి శిరమును వంచి వినతంగ్రీ వరిక్
ముదముగఁ దాల్చిన తాషం
విరి చేతుల నవ్వుచు లెక్కపెట్టఁగఁ దొడఁగెన్ 54

హిమవంతుఁడాప్తి సంతో
ష్యము గలవాఁడయ్యె మేన సది సంబరసెన్
తమ కన్నియల యెదల నన
యమును గృహస్థులకుఁ గంట్లెఁ యవుడుదు గృహిణుల్ 55

పతి కిష్టంబగు పనిలో
సతి మేనకయుఁ గూడ సమ్మతి చూపెన్
పతి కిష్టంబగు పనులన్
పతివ్రతలు మరొకమాట వాకొనదెపుడున్ 56

ఇది యిట తగు నుత్తరమని
మదిని విమర్శించి యాహిమాలయుం డెలమిన్
పిదప నుడులతుది వారికి
నెదుటం బెట్టెను నలంకరించి తనూజన్ 57

అమ్మాయి! రమ్ము! విశ్వా
త్మమ్మగు శంకరునకీవు తగు భిక్షగనై;
తిమ్మునులో భిక్షకులు; నా
కిమ్ముగ గృహమేధి ఫలము నిదె ప్రాప్తించెన్ 58

ఇటు పలికి తనయ గూరిచి
యటుచూచి పలికె హిమాద్రి యామౌనులతో
ఇట మీకు మ్రొక్కుచున్నది
నిటలాక్ష వధువని సుతను నెఱి మ్రొక్కించెన్ 59

అంతట ఆ మునీశ్వరులు ఈప్సితార్థమును దెలుపు కార్యముచే నుదారమైన యాహిమవంతుని వాక్యము నభినందించి ముందుఁ బండఁబోవు నాశీస్సులచే అంబికను వర్ధిల్లఁజేసిరి. పిదప బంగారు భూషణములు జాఱుచుండగా ఆదరమున నమస్కరించుచు సిగ్గిలుచున్న పార్వతిని అరుంధతి తన యొడిలోఁ గూర్చుండఁ బెట్టుకొని కొమార్తె యందలి స్నేహముచేఁ గన్నీళ్లు పెట్టుకొను నామె తల్లి మేనకను అనన్యాపూర్వమైన వరుని గుణములను వర్ణించుచు ఆమె శోకమును మాన్పించెను. అప్పుడు వివాహమునకు ముహూర్తమెప్పుడని హరబంధువగు మౌనియడుగ నాహిమవంతుడు మూఁడు దినముల తర్వాత అనుటయు విని నారబట్టలు ధరించిన ఆ మునులు అటు నుండి కదలి హిమవంతుని దరి సెలవు గైకొని అతని వీడ్కొని సత్వరంబ శంకరుని దరికేగి తాము నెఱవేర్చిన పనిని నివేదించి యతని యనుజ్ఞ గైకొని ఆకాశమార్గమునఁ దన నిలయములకు వెడలిరి.

పశుపతియైన యా శివుఁడు పర్వతపుత్రి సమాగంబుకై
భృశమును నువ్విళ్ళూరు మదినెట్టులో యాదినముల్ వెలార్చె నీ
దృశవిభుసైనఁ గూడ నిఁక నిట్టులు కోర్కెలుసోక, కోర్కెలన్
వశులగు వారికెట్టు లిఁక బాధలు గూర్పక యుండు నీభువిన్ 60

ఇది

## ఆరవ సర్గము

—:o:—

# కుమారస్వామి జయము

## ఏడవ సర్గము

### పెండ్లికూతురు ఉమను పుణ్యవతులు సింగారించుట

పిదపఁ జంద్రుఁడు వృద్ధిలో వెలయుచుండ
సప్తమస్థానమునయందుజరుగుతిథిని
బందుగులఁగూడి హిమవంతుఁ డందమలర
ఆత్మజకు యథావిధిఁ బెండ్లియాచరించె 1

పెండిలి వేడ్కలన్ మునిఁగి ప్రేమను ముత్తయిదుల్ శుభార్థముల్
నిండియునింట నింటఁ జనులెల్లఁ బొనర్చుచు సందడింపనా
కొండలరాజు పట్టణము గూడను నొక్క వివాహగేహమై
యుండెను నొక్క వేదియయి నొప్పెను నంతిపురంబులెల్లయున్ 2

మందార వృక్షంబు లందాల పూలతో
రాజ వీధులను నలంకరించె
అంబరంబంటు చీనాంబరా లూరెల్ల
జండాల మాలల నిండు గూర్చె
చెలువొల్కు కాంచన శృంగంబు లెత్తైన
తోరణ పంక్తుల బారుతీర్చె
మేరున కాతల మేకొని యింకొక
స్వర్గంబు దిద్దిన సొరులీనె 3

పుత్రులెందఱున్నను గిరి పుత్రియొకతె
యెపుడొ కనినట్లు తిరిగి జన్మించినట్లు
పెండ్లి వేడ్కలు దరిరాఁగఁ బితలకామె
పూని యూర్పుల నూర్పయి ప్రాణమయ్యె 4

ముద్దులు గురిపించు ముత్తైదువు లొకొక్క
యొకినుండి యొడనామె నుంచి కొనిరి
సరిచూచి మురువులు కురిపించు నామెకు
నగలపై నగలను మగడ నిడిరి
పట్టు వల్వలనేరి నిట్టటు గిరిజకు
బట్టపై బట్టలఁగట్టినారు
కాళ్ళకు వ్రేళ్ళకు నొళ్ళు వెక్కళ్ళకు
రంగుపై రంగులు రాసినారు 5

వారి వారి సంబంధముఁ బట్టిచూచి
వేఱువేఱైన గిరికుల ప్రేమఁబట్టి
అఖిల బంధువులకుఁ గూడ నామె యొకతె
యొక్కటే యాశ్రయంబయి యొప్పుమీఱె 6

ఉత్తర ఫల్గునీ నక్షత్రములు చంద్రునితో యోగ మొందిన సమయంబున మిత్ర దేవతాకమైన శుభముహూర్తమునఁ బతిపుత్రవతులును పుణ్యావతితలునైన బంధుస్త్రీలు ఆ పార్వతి శరీరమును సింగారించిరి. ఆంత నాపార్వతి తెల్లని యావాల నుంచిన చిఱుగఱిక చివుళ్ళతో మెఱసి సొరులీను పట్టు మువ్వాలువను నాభి కనిపింపని తీరున ధరించి యాచారంబు కొఱకైన బాణమును దాలిచి యభ్యంగ శృంగారమును నిర్వర్తించె.

పెండిలి దీక్షా విధితో
నిండగు శరము సుమ మేన నిలివి వెలింగెన్
మెండగు రవికరమునఁ బువు
చెండయి పెరుగు తొలినాటి శశిరేఖవలెన్ 7

నూనెపోవ లొద్దుగ పిండి మేన నలిచి
తడియునాఱ గంధద్రవ్య మొడలఁబూసి
స్నానమునకైనపట్టు దువ్వాలువ గట్టి
స్త్రీలునల్గొగసాలనుజేర్చిరపుడు 8

గరుడపచ్చల్ పొదువు ఫలకంబుపైని
సొబగు ముత్యాలహారాలు చుట్టు వ్రేల
పసిఁడి బిందెలు వంచి పార్వతిని జలక
మార్చిరట మంగళంపు వాద్యములు మ్రోయ 9

మంగళ స్నానమున విశుద్ధాంగి యగుచుఁ
బతిని గనఁగోరు నుమ పట్టువలువఁ గట్టి
చేరి మబ్బుచేతఁ గృతాభిషేక యగుచు
విచ్చుతెల్లు పూల్ గల భూమి విధము మెఱసె 10

అందుండి, నీలిచాందిని
యందాలిడు నాల్గుమణిమయ స్తంభములన్
విందగు గృహమున నా సన
ముందగు వేదికి నడిపిరి ముత్తైదువ లుమన్ 11

పిదప నా పుణ్య స్త్రీలు ఆ పార్వతిని తూర్పు ముఖంబుగఁ గూర్చుండఁబెట్టి తాము ఆమె ముందయుండి ఆమె నలంకరించు సమయము సమీపించినను సహజంబైన యామె మేనియందాలు వారి చూపును హరించి వేయ ఎట్టు లామె నలంకరింపవలెనో దిక్కుతోచక నిశ్చేష్టలై యొక్క క్షణ మూరక నిలిచి యుండిరి. అప్పుడు ఒకతె అగరుధూపంపు వేడిచేఁ గురులతడియార్చి పట్టుకుచ్చుంబోని కురులలోఁ బూవులుదీర్చి దూర్వాంకురంబులు గ్రుచ్చిన పాండువైన మధూకదామంబు యిప్పపువుమాలిక నొయ్యారంబుగ వ్రేలఁ దుఱిమి యుదారమైన గిరిజ కేశబంధమును దీర్చెను తెల్లని యగరు గంధంబుల నంగంబుల నలందె నందు విడిరేకలు కనుపట్టునట్టు లెఱ్ఱని గోరోచనంబుచే దిద్దబడిన యా పార్వతి, చక్రవాక మిథునంబులచే నంకితంబయిన యిసుక తిన్నెలవన్నెలు గూర్చు త్రిపథగయైన గంగానదివలెఁ గాంతులీను చుండెను కురులచే గప్పఁబడిన యామె వదనలక్ష్మి తుమ్మెదల బారుపై ముసరిన తామర పువ్వును, నుసుమబ్బు రేకలలమిన చంద్రబింబమును తనకుఁ బోలికలుగా చెప్పు కథలను త్రుంచి వైచెను లొద్దుగ గంధంబుల పూతచే గఱుకయి గోరోచనము దిద్దుటచే గౌరంబయిన యామెచెక్కుపై కర్ణంబు నంచఁదుంగా వ్రేలుచు పొందవలసిన

యుత్తమ స్థానంబు పొందుటవలన యవాంకురము చూచువారి చూడ్కుల ఇటునటుపోకుండఁగట్టివైచెను. చక్కఁగా నేయవయవమెంత యుండవలెనో విభజింపఁబడిన గాత్రములుగల యామె యధరోష్ఠముచే విభక్తమయి మైనముచే స్వచ్ఛగాఁ గడుగఁబడిన రాగముగలిగినదై యదరుచు దానిలా కణ్వాఫలమును పొందు సమయము సమీపింప నేదో యనిర్వాచనీయమైన కాంతిని బొందియుండెను.

పదములఁ బారాణి దీ
ర్చి "దీనిచేఁ బ్రియుతల వెలసిన శశికళఁ ద
న్నెదుగాక" యని పరిహసిం
చి దీవెనయిడు చెలిని సుమ చెండునఁ గొట్టెన్ 12

లలి బయలుదేఱు నల్లని
కలువల జోకఁ దెగడు నుమకనులంగని జా
ణ లలంకరిణులుఁ గనుజో
కలఁగాటు కిడిరి శుభమని; కాదికద్యుతికై 13

విప్పు పువుల లతవలెఁ; బయి
వచ్చిన తారకల చేత వడి రాత్రివలెన్
వొచ్చిన పక్షుల నదివలె
హెచ్చిన భూషలను గౌరియింపులు గుల్కెన్ 14

ముద్దుల గట్టెడి తనరూ
పద్దమునఁ గన్గొని స్తిమితాక్షియయిన యా
ముద్దియ హరుఁగనఁ ద్వరపడె
ముద్దియ లందములు ప్రియులు పొడగనుటకెగా 15

అపుడు రెండు వేళ్ళతో తడియరిదళమును మణిశిలను తీసికొని, వీనులందు స్వచ్ఛమగు కమ్మలు ప్రేలునొయ్యారి గౌరి ముఖమును పైకెత్తి మొదట గౌరికి యౌవన మంకురించినపుడు మురిసి పెట్టవలయుననుకొన్న వివాహదీక్షా తిలకమునే నేఁడు మంగళమునకయి మేనక తన కుమార్తెకు

పటులో దిద్దెను. ఆనంద బాష్పములచే దృష్టి చెదరఁగాఁ గట్టవలసినచోటు తప్పి, మేనక ఉన్నితోఁ జేసిన రక్షాబంధమును ఇంకొకతె కట్టుచుండఁ జూచి పెంపుడు తల్లులు ఆమె వేళ్ళను సరిగాఁ జూచి చూపఁగా సరియైనచోటఁ గట్టెను. ఆ సమయంబున ఆ గౌరి నురుగుల పుంజముగల క్షీరసముద్రవేల వలె నిండు చందురునితోఁ బ్రకాశించు శరత్కాలపు రాత్రివలె ఆ క్రొత్త పట్టువలువఁ దాల్చి అద్దముచేత ధరించి ప్రకాశించెను. కర్తవ్యములందు దక్షురాలగు నా తల్లి మేనక కులమునకు ప్రతిష్ఠయగు నా గౌరిచే ముందుగా పూజింపఁబడిన కులదేవతలకు నమస్కరింపఁజేసి సాధ్వీమతల్లుల పాదములను గ్రహింపఁ జేసెను. అపుడు వారందఱు తమ కాళ్ళ దగ్గఱ నమస్కరించుచు వంగిన ఆ గౌరితో "అమ్మాయి నీవు అఖండమైన భర్తృప్రేమను పొందుము" అనియాశీర్వదించిరి. స్నేహముగల సాధ్వులయాశీర్వాదఫలమె తరువాత నామెకు పతియొక్క యర్ధశరీరము పొందునంత యుత్తమస్థితి యయ్యెను. అంత హిమాలయుండు తన యిచ్ఛకును నైశ్వర్యమునకును తగునట్లు చేయవలసిన కృత్యములు జరపి సుహృదులతో నిండిన సభయందు వృషభవాహనుని రాకను ప్రతీక్షించుచుండెను.

## ఈశ్వరుని యలంకరణము

ఇంకనక్కడ కైలాసమున ఆదరముగల బ్రాహ్మి మొదలగు సప్త మాతృకలును అదియె మొదలగు ప్రాణిగ్రహణంబునకు నుచితంబయిన యలంకరణ పరికరమును ఈశ్వరుని యెదుట నుంచిరి. అంతనాపురశాసనుండు ఆ మాతృకలయందలి గౌరవంబుచేత నా యలంకార సామగ్రిని కేవలము తన చేతితో తాకి మర్యాద చూపెను. ఆ పెండ్లికుమారుండగు హరుని కిష్టమయిన మొదటి వేషమె కళ్యాణమునకుందగిన యుత్తర భావము గలదిగా మాఱిపోయెను.

గాత్రానఁ బులిమిన కాటిలో భస్మము
లందిన శ్వేతాంగ రాగమయ్యె
నెత్తిపైఁ బెట్టిన నెఱిపుఱ్ఱె చిప్పయె
మూర్ధానఁ దీర్చిన భూషయయ్యె

ప్రాంతాలపొడ లొప్పువారణ చర్మమె
కలయంచ యంచుల వలువయయ్యె
మెడపైని ప్రేలాడిమెదలు ప్రేవుల త్రాళ్ళె
మేలి ముత్యాల హారాలెయయ్యె 14

నుదుటి మొముకయందలరి లో మెదలుచున్న
స్వచ్ఛపు వసుపొకసు గ్రుడ్డు సొరు మీఱు
కన్నెయవిడశ మయమయి గ్రాలుబొట్టు
కరణి భాసింప హరుమోము మెరసిపోయె 15

తగు ప్రదేశాల భూషణాలుగ వెలుంగు
సర్పముల మేనమాత్రమె సరిగమాటె
పడగలందలి మాణిక్య భాసలెల్ల
మున్నుదీపియల్లె వెలుగులు పోయుచుండె 16

పగలు కూడఁ గిరణ కాంతిఁ బఱపుచుండి
చిన్నదగుః చేతఁ గళ క మెన్నరాని
చంద్రరేఖ యెప్పుడు మోము నందగింప
భవుడు మణిశిరోమణిదాల్చు పని యుకేల 17

ఇటులఁ దన ప్రభావము వల్ల నెన్నొ గొప్ప
యద్భుతముల కొక్కఁడె పుట్టువైన హరుఁడు
సకల శృంగార వేషంబు సంతరించి
సవిధ గణ ఖడ్గమున స్వరూపంబుగనియె 18

నంది భుజము నానుకొని యంతట శివుండు
పెద్దపులి చర్మగల యెద్దు వీపుపైని
తనదు భక్తిచేఁ దన గొప్పతనవుముడిచి
మెసఁగు కైలాసమునఁ బోలె నెక్కవెడలె 19

ఆ మహాదేవు వెనువెంట నరుగునప్త
మాతృకల స్వవాహనములు మసలి వెవుల

కమ్మలను నూప ద్యుతిపరాగాల గౌర
మగు ముఖములఁ జేసిరిమిన్న నజ్ఞసరసు 20

బంగరు వెలుంగు లొప్పారు వారి వెనుక
కరకపాలా భరణ మహాకాళి వెలసె
బిఱుబలాక లొప్పి వెలికిఁ జిమ్ము మెఱుపు
లోలిఁదగు నీలిమబ్బుల జాలువోలె 21

పిదప శూలికెమిటు పైలుదేఱె ప్రమథ
గణము కలిసి మ్రోయించు మంగళపుఁ దూర్య
ఘోషము, విమాన శృంగాలు గూడఁ జొచ్చి
యందుఁగల సురలకు సేవ కపుడు గూర్చె 22

పడి సహస్రరశ్మి యగు సూర్యుఁడు తనంత
విశ్వకర్మ తీర్చిన గొడుగును వేసిపట్టె
అపుడతని దరి శిరసొప్ప, నాముకూల
మధ్యమందలి పడెదు గంగ మాటిక్రిదనరె 23

అపుడు మూర్తిఁదాల్చిన గంగ యమున లలరి
తెలుపుఁ జామరములు పట్టి గొలిచిరభవు
అవి నదీ రూపమును వీడినప్పటికిని
హంస సంచారములు గల్గినట్లు తోఁచె 24

మొదట బ్రహ్మ వచ్చి శివుని కెదుర నడచె
పిదప శ్రీవత్సయుచి విష్ణు వెదురు నిలిచె
శివు మహిమను జైజై వాక్కుచేత మెచ్చి
రగ్నిహోత్రుని హవిసుచే నట్లు వారు 25

మూర్తియ దొకటె విడిపోయె మూఁడుగాఁగ
ముందు వెనుక మూఁడిటికి మామూలు మాటు
హరికి హరుఁడాది, హరియొక ప్పతనికాది
వారికిని బ్రహ్మ బ్రహ్మకు వారెయాది 26

అనంతరంబ దేవేంద్రాది దిక్పాలురు ఛత్రచామరాది రాజలాంఛనములు విసర్జించి వినమ్రమైన వేషములతో రాఁగా, నందీశ్వరుఁడు సంజ్ఞ చేసి చూపింప ఈశ్వరునికి నమస్కరించిరి. అంత మహాదేవుఁడు తల పంకించుటచే పద్మసంభవుని, వాక్కుచే హరిని, చిరునవ్వుచే దేవేంద్రుని, చూపుచేత సమస్త దేవతలను పెద్దచిన్న క్రమము ననుసరించి సంభావించెను.

పిదప సప్తర్షులు చిరునవ్వుతో నాశీర్వదించిరి. అపుడా హరుఁడు వారిని జూచి "ఈ వివాహ యజ్ఞమందు ఇదివఱకే నేను కోరినట్లు మీరె ఋత్విక్కులయి కార్యము నెఱవేర్పుఁడు" అనియె. విశ్వావసువు మొదలైన ప్రవీణులు "త్రిపుర దహన" గేయప్రబంధంబు గానంబు చేసిరి. రాగాది వికారంబులకు వశుండుగాని చంద్రఖండ శేఖరుండు మార్గముపట్టె చన బంగరుమువ్వల మంగళ ధ్వనులుచే సిరి మేఘములు కలిమిన కొమ్ములను గట్టి ఢీకొని దువ్వటచే దుమ్ము అంటుకొనియున్న వానిని వలె విదలించి ఆకాశగామియైన వృషభంబు ఆ శివుని తన విశాలమైన వీపున నెక్కించుకొనియె. అపుడు ఇతరు లెదుర్కొన రానిదియు నగేంద్రునిచే రక్షింపఁబడినదియునగు నగరంబును హరుని దృష్టి పాతంబులనెడి బంగారు త్రాళ్ళచేత వలెలాగఁబడి సుముహూర్త మాత్రమున సమీపించెను.

ఆ నగరము పొలిమేర ఘనంబువోలె నల్లని కంఠంబుగల నీలకంఠుఁడు పురసుందరులు మోము లెత్తి వీక్షించుచుండ తన బాణము నానుకొని దిగునపుడు బానిచే నంకితంబైన మార్గమునుండి సమీప భూమిని చేరెను. అపుడు ఆ హరుని రాకకై యెదురుచూచు పర్వత చక్రవర్తి సమృద్ధమైన యా యీశ్వరుని బంధుజను లధిష్ఠించిన యేనుఁగుల గుంపులతో వికసించిన పువ్వులుగల వృక్షంబులతో నిండిన తన కటకంబులతోవలె నెదురేగెను. ఆ మహాదేవుడు ఈ పర్వతేశ్వరుఁడు ఈ యుభయులగు పెండ్లి వారు తలుపులు తెరవంబడిన ద్వారమున-దూరముగా వ్యాపించిన కెరటముల ఘోషంబులు వలె సమీపించిరి. అనంతరము త్రిలోక్యవంద్యుఁడు హరుడు తనకు వంగి నమస్కరింప భూమిధరుండు సిగ్గుపడి యదివఱకె యా హరుని మహిమచే దూరముగా వంగిన తన శిరస్సును ఎఱుఁగఁడయ్యె. అట్లు పరివార యుతుండై యేతెంచిన అల్లుఁడు ఈశ్వరునికి ముందుగాబోయి ప్రీతితో

ముఖలక్ష్మి వికసింప హిమవంతుడు మణులనుగూడఁ గప్పివైచునట్లు పూవులు చల్లిన మార్గములతో నలరారి సమృద్ధమైన తన మందిరమున ప్రవేశపెట్టెను.

## ఈశ్వరునిచూచు పురసుందరులచేష్టలు

* పైఁడి కిటికీల మెరసెడి మేడలందుఁ
దత్సమయమున హరుఁజూడఁ దహతహపడు
పురి యొయారు లితర కార్యములు మఱచి
చేయు చేష్టలీ తీరుగఁ జెలఁగి యుండె — 27

వెంటనె కిటికీ దరికిని వెళ్ళుచుండి
జుట్టు ముడివీడి పూవులు చుట్టురాల
జుట్టు ముడివేయఁ జేతితోఁ బట్టికూడ
ముడువఁ దలఁపనే తలఁపదు ముదితయొకతె — 28

లాగిపట్టి కాలి తుదనలంకరించు
ధాత్రినుండి యీడ్చుకొని యందాల నడలు
వదలి, రంగారకుండఁ గిటికీ వఱకునొక్క
పడఁతి పారాణి యడుగుల నిడుమనేగె — 29

* కాటుకను ముందె కుడికన్ను గారవించి
ఎడమ కంటికిఁ గాటుక యిడకె యుండి
కాటుకిడు చేతి పుడకతోఁ గాంత యొకతె
మేడ కిటికీ దరికి వేడ్కతో నరిగె — 30

కిటికీ మధ్యను జూపిడి
తటుకునఁ జనువేళ వీడు తనకోక ముడిన్
కటి ముడువక యొక్కెత, పో
క్కిట నిడుభూషణ రుచిగల కేలన్ బట్టెన్ — 31

---

(1) ఇక్కడి పద్యములును రఘువంశములో 7 సర్గ 5వ శ్లోకము నుండి అజుని నిందుమతిని జూచునప్పటి స్త్రీల విలాసలుగల శ్లోకములును నివియు ఒక్కటే.

(2) స్త్రీలు ఎడమ కంటికిముందు కాటుక పెట్టుకొనుట ఆచారము అది వదలి ముందు కుడికంటికి పెట్టుకొన్నదని భావము.

సత్వరమ్మె లేచిన యొక్క చాన, నగము
గ్రుచ్చి సంభ్రమంబునఁ జైకి హెచ్చి చిమ్మ
ప్రతి యడుగున మణుల్ జారి పడఁగ బొటన
ప్రేలి మూల, మేఖల కొక్క నూలె మిగిలె॥ 32

అతి కుతూహల లయిన యాయలరుఁ బోండ్ల-
ఆసవ సుగంధమొప్పి - యల్లాడు కండ్ల
తుమ్మెదలు గల - ముఖములతోడ నిండి
కమల తోరణాలటు గవాక్షములు వఱలె॥ 33

ఇట్లు పుర సుందరులు మోముమండ చందాలతో నిండి ఉన్నతమైన తోరణములూగులాడుచుండు రాజమార్గమును ఆ చంద్రమౌళి తన శిరోభూషణమైన చంద్రుల వెన్నెలలచే ప్రాసాద శిఖరములను పగలుకూడ అభిషేకము చేయించి రెట్టింపు ద్యుతులు వెదఁజల్లునట్లు చేయుచు చేరెను,

ఆ లలనలు శివున్ దృష్టిఁ గ్రోలుచుండి
యన్య విషయాలవైపున కరుగరైరి
వారి యితరేంద్రియముల వ్యాపారమప్పు
డెల్ల గతులఁ గండ్లనె ప్రవేశింపఁబోలు॥ 34

మృదులయయ్యు దుశ్చర తపస్సిందుకీమె
యాకులను దిన కొనరించె; నర్హ మిద్ది
అభవు దాన్యా మొందునతి యనుగృతార్థ యగును
నింక నొడియొక్కచో వచియింపఁ గలమె॥ 35

కోరఁదగిన సౌందర్యంబు కూడియున్న
కపయిది పరస్పరంబుతోఁ గలుపకున్న
జంటయగు వీరికి విధాత సలిపియున్న
యాకృతుల కూర్పులు విఫలమయ్యెడివియె 36

కోపమునరేగి యాతఁడు కుసుమశస్త్రుఁ
దగులపెట్టలే, దిది వాస్తవమునుమ్ము

ఇట్టి భవు గాంచి సిగ్గుచే నింకతాను
తన తనువు వీడె మన్మథుండని తలంచు॥ 37

తాను కోరిన యాశు బాంధవ్య మిపుడు
భాగ్యవశమునఁ బొంది యా పర్వతేశుఁ
డిది వఱకె భూమి నెత్తుట నెత్తియయున
తన శిరస్సునింక నెత్తుకొనును సఖియ! 38

## ఎదురుసన్నాహము

అని ఇవ్విధములగు నా యోషధి ప్రస్థపురము నందలి యువ్వారుల వీనులవిందైన పలుకులను ఆ త్రినేత్రుఁ డాలకించుచుఁ గేయూర భూషణంబులకుఁ దగిలి చింపియును పేలాల గుప్పిళ్లతో నిండి, యా హిమాలయుని యాలయమును జేరెను. అందు ఎదురువచ్చి యమ్మవారుండును చేయందియ. శరత్కాల మేఘంబునుండి సూర్యుండువలె వృషభ మునుండి దిగి కమలాసనుండను ముందు నడిచి దారిచూపు సర్వతరాజు భవనంబునందలి కక్ష్యంబులను చొచ్చెను. పిదప ముందుగా సప్తర్షులు మొదలగు వారలు నడచిరి ఆ పిదప దేవేంద్రాది బృందారకులు అనుసరించిరి ఆ పిదప ప్రమథ గణంబులు ఉత్తమ ప్రయోజనంబులు ప్రశస్తమైన యారంభ యత్నంబునువలె ఆ యాశ్వారుని ననుసరించిరి. అక్కడ ఈశ్వరుండు ఆసనమునఁ గూర్చుండి హిమవంతుడు సమర్పించిన రత్నములతోఁ గూడిన యర్ఘ్యము, తేనెతోఁ గూడిన గవ్యమును నూతన దూకూలములను సమంత్రకముగా గ్రహించెను. దుకూలములు ధరించిన భార్గుని చంద్రకిరణములచే సముద్రవేలదరిత్రి స్ఫుటమైన నురుగల పంక్తిగల సముద్రునివలె-వినయులగు అవరోధ రక్షకులగు స్త్రీలు వధూ సమీపమునకుఁ దీసికొని వెళ్ళిరి.

మోము చందురు వెన్నెలల్ పొలుపులీను
లలనతోడ-విచ్చిన కన్నుఁ దెల్లఁగలుప
ల్లమలమానసనలిలంబు లమరు శివుఁడు
కలిసి శరతుచే లోకంబువలె వెలింగె 39

ఒండొరుల లోలమయి వారి రెప్పకనులు
ఒక్కటొక్కటే తనుఁ గలియుచును నులికి,

కొంచెముగ నాగి, మరివెన్కను జలించి
సిగ్గుచేత సంకోచించి చెదరెనపుడు 40

## వివాహపు వేడుకలు

త్రిజయుని భయంబున నుమాతనువులోన
దాగిన తన వొప్పు స్మరు నాద్యంపుమొలక
కరణి-నెఱ్ఱని ప్రేళ్ళఁదనరుప్ప గిరిజచేయి
గిరి పురోహితుఁ డందియ హరుఁడుపట్టె 41

మొదటఁ బార్వతి యొడ తెల్లఁబులకరించె
శంకరుని యెదుప్రేళ్ళను జెమ్మగిల్లె
వారి చేతులంతటఁ బరస్పరము కలియ
సరిగ-మనసిజు పని పంచుకరణి తోఁచె 42

ఎవరి స్మృతి మాత్ర లోకాన నితరులైన
వధువు వరుఁడు నుత్తమ కాంతిఁ బడయుమంద్రో
అట్టి వారికి కలయికె యైనప్పుడింక
వారి శ్రీ యెట్టిదో చెప్పవలనువడునె 43

పైకి జ్వాలలు లేచెడి వహ్నిచుట్టు
ఆ యుభయులు ప్రదక్షిణ మాచరింప
ఒండొకటితోఁ గలిసి రాత్రియును పవలును
మేరుగిరిచుట్టు తిరిగెడి సొరుతోఁచె 44

వార లన్యోన్యము స్పర్శచే వ్రాలుగనుల
జరగఁగఁ బురోహితుఁడు మూఁడుసార్లు నగ్ని
కిని ప్రదక్షిణ చేయించి కెరలు నగ్ని
వధువుచే లాజహోమము వరలఁ జేసె 45

మదిని దనుపు పేలాల ధూమమును, గురువు
చెప్ప దోసిటఁ గొని మోముఁ జేర్చె నామె
పొగలశిఖ చెక్కులదరిఁ బొలిచి క్షణము
చెవుల నల్లగలువఁజేకువలె మెఱసె 46

ఆ వధువు మోము శుభమున కడరు పొగలు
సోకుటను చెమ్మటలు చెమర్చు సుంతకందె
కనుల నల్లకాటుకరంగు కరఁగి జరగె
చెవిని వ్రేలిన వరియాకు వివర కమితె 47

అటఁ బురోహితుఁ డనె "బిడ్డ! అగ్ని యితడు
కనుము నీ వివాహమునకుఁ గర్మసాక్షి
తగిన పతి శివుతో నీవు ధర్మ చర్య
ఏ విచారణ లేక గావింపవలయు" 48

కనుల దాఁక వినులఁ బంపి వినుతయామె
సహ సుధర్మం చర" యను నాచార్యు పలుకు
వేసవి ముదర నుడుకెత్తు పృథివి మొదలె
పడిన వర్షపు నీటినివలెను గ్రోలె 49

ధ్రువమతి, ప్రియరూపుఁడు, పతి
ధ్రువనక్షత్రమును జూపఁ దొయ్యలి యెటులో
స్వవదనము బైకెత్తి త
గ వినిచె సన్నగను లజ్జఁ "గంటి" నటంచున్

వ॥ ఈ విధముగ విధి నెఱిఁగిన పురోహితుఁడు పాణి గ్రహణోప చారములు చేయింపఁ బ్రజలకుఁ దల్లిదండ్రులైన వార లిరువురు పద్మాస నమునఁ గూర్చుండిన పితామహునకు నమస్కరించిరి. అపుడు విధాత "కళ్యాణి! వీర ప్రసవవు"కమ్మని అభినందించి తాను వాగ్దేవికిఁ బతియయ్యు అష్టమూర్తికైతే ఆశీస్సిడు విచారణ మాని స్తిమితుండై యుండెను. పిదపఁ బుష్పాద్యలంకరణములతో శోభిల్లు నాల్గంచులుగల వేదికను దరిసి బంగా రపు టాసనమునఁ గూర్చుండి లోకాచార ప్రకారము ననుసరించి యా దంపతులు ఒకరిపై నొకరు అక్షతలు పోసికొనిరి. అంత లక్ష్మీదేవి జేకుల సందులందంటుకొన్న నీటి బిందువులజాలు మేలి ముత్యాల జాలువలె భాసిల్లు పొడుగుపాటి నాళదండముగల తామర పువ్వుల గొడుగును వారిపై నుంచెను. సరస్వతీదేవి ప్రాకృత సంస్కృత భేదంబుల రెండువిధములైన

మాధుర్యమును స్వీకరించి సంస్కారపూతమైన సంస్కృత వాక్కులచే ఆరాధ్యుఁడగు శివుని, సుఖముగఁ దెలియఁదగు ప్రాకృత వాక్కుచే వధువును అభినందించెను

ముఖ ప్రతిముఖాది పంచసంధులందుఁ గైశిక్యాది వృత్తులతో నొప్పారి, శృంగారాది రసాంతరంబుల ననుసరించి నిబంధింపఁబడిన రాగంబులతో సుందరంబయి లలితంబైన యంగహారంబులతో నలరారు నప్సరోంగనల నాటక ప్రదర్శనమును వారిద్దఱు నొక ముహూర్తంబు తిలకించిరి. అంతనా నాటక ప్రదర్శన ముగిసిన పిదప సమయంబు కనిపెట్టి పట్టి ద్వితీయుండగు నా శంకరుని సమీపించి దేవతా నివహంబు కిరీటతటంబుల నంజలి ఘటించి యొక్క శాపావసానంబున స్మరునికి శరీరంబు ప్రాప్తించి సిద్ధింప వేడిరి. అప్పుడు నిసర్గముగఁ గోప మెఱుంగని యా భగవంతుఁడగు హరుఁడు ఇతరులమీఁదనేగాక తనమీఁదఁగూడ కుసుమ శరంబులు వేయు కాముని ననుగ్రహించెను. ఎప్పుడును తగుకాలంబునఁ గార్యవిదులచేఁ బ్రభువులందుఁ బ్రయుక్తంబయిన విజ్ఞాపనము సిద్ధిని పొందును గదా.

పిదపన్ దేవగణాల్ స్వగేహములకున్ వెళ్ళంగ వీడ్కొల్పి వం
ద్రధరుండా గిరిరాజ పుత్త్రికరమున్ హస్తానఁ గీల్కొల్పి చే
చెంతఁ దగన్ బంగరు పూర్ణకుంభముల నోలిన్ నిండియున్ జిత్తప్రు
ష్పడాలన్ విలసిల్లి 1* నేలపయి సెజ్జల్ గల్గునంతఃపురిన్ 51

క్రొత్తగనైన పెండ్లిఁ దపకొత్తెయు సిగ్గు విభూషణంబుగా
హత్త, వినాతె మెత్తుమొగమావలి వైపుగఁ ద్రిప్పి, మంచపుం
గొత్తు గలట్టి యాచెలిమి బోంట్లకు నెట్లొ జవాబులిచ్చు రా
2* క్రొత్తగు పెండ్లికూతుగణకోద్ధ కృతిన్ నగుపించె గూఢతన్ 52

ఇది

-ఏడవ సర్గము-

---

1* "త్రిరాత్రమధశ్శయ్యా క్షారలవణ వర్జం" పెండ్లియయిన పిదప మూఁడు రోజులు కేవలము నేలమీఁద పండుకొని యుప్పుఁగారములు వర్జించియుండవలెనని ధర్మశాస్త్రము గణ-ప్రమథగణంబుల, క-దేహము తలలందు ఉత్థ బయలుదేఱు కృతిన్ ప్రయత్నముచేత.

2 + "క్రొత్త వధున్ సతిన్ గణముఖోత్థకృతిన్" అని పాఠాంతరము

# కుమారస్వామి జయము

## ఎనిమిదవ సర్గము

### ఉమా మహేశ్వరుల విహారములు

– ఎనిమిదవ సర్గము –

పెండిలి సంబరాలయిన పిమ్మట శంకరుపైని గౌరికిన్
మెండగు భావనల్ మదిని నిండు, నణంగిన సాధ్వసంబులున్
పండగఁ గాము దోహదమునన్ మొలకెత్తి చివుళ్ల పూవులున్
పండులు నిండ నాతనువు నందన వాటియటుల్ విరాజితెన్ 1

అనయము పిల్వ యేదడిగి నప్పటికిన్ బదులీయకుండు దాఁ
బనివడిఁ జీరకొంగు బిగి పట్టియులాగినఁ బోవఁగోరు; శ
య్యను శయనించియున్ మొగము నావలివైపుగఁ బెట్టి పండియుం
డును, ఇటులుండియున్ ప్రియవినోదము మోదముఁగూర్చె శూలికిన్ 2

ఊరక యే కుతూహలము నొంది హరుండు పరుండియుండగా
గౌరి, ప్రియున్ ముఖంబున ముఖంబిడి చూచె. నంత సొం
పారఁగ నవ్వ్యక్షులు తెఱవన్ మెఱవన్ గొరడానువేని గం
భీరతఁ గొట్టినట్లు మిరుమిట్లిడ మూసెను గౌరి కన్నులన్ 3

చెంతకుఁ జేరి బొడ్డుదరిఁ జేతినిఁ గా-ముఁడు జార్చుచుండనా
కాంత సణంకుచున్ ప్రియుని కమ్రకరంబును చేతితోడ న
ల్లంతనె యాపెఁ గాని తనయంతనె చేలము విప్పకుండనే
యంతనెయూడిపోయెఁ దన కెందుకు మధ్యా నటుంచునెంచెఁబో 4

"ప్రియసఖి ! సాధ్వసంబులవి వీడి రహస్యమునందు నిట్టులన్
నయముగ శంకరున్ గొలువ నైపుణి" నంచు సఖుల్ ప్రబోధ చే

సి. యనివిఁ త్రోసినప్పటికిఁ జెంతఁ బ్రియుండిఁక నిల్చినంత, నే
మియుఁ గనకుండి వ్యాకులత నెల్లయు విస్మృతిచెందె నెమ్మదిన్ 5

అతనుని శాసకుండుహరుఁడట్టిటు పల్కె కథాప్రవృత్తి, తే
గతిఁ గనరాని వస్తువులఁగాంచగఁ బ్రశ్నలు గ్రుమ్మరించినన్
ప్రతిపలుకీయకే కనియు వంకరచూపులతోనె నిల్చియుం
డి తలను నూపుచున్ మిగుల నెమ్మది నిచ్చెనదే జవాబుగా 6

వేగహరుఁ డొంటిఁ దనబట్ట లాగివేయ
రెండు చేతులను, హరుకండ్లుమూసెఁ
గాని యాలోనె నుదుటను గల్గుకంటి
హరుండు గన, నామె యత్నంబు వ్యర్థమయ్యె 7

ప్రియుఁడు ముద్దులఁ గురిపింపఁ బెదవియిడక
నలఁతికౌగిలి యిడఁ జేయి యడ్డుపెట్టి
యంగజుని చిట్లు వ్యాధపెట్టెనైనఁ బతికి
పదు లరుదయిన వధూ సంగమమొదవెఁ బ్రియమె 8

మోనిని పంటినొక్కులవి పొందనియట్టులు మోము పట్టుటల్
తావుల గాయముల్ పడని తాలిమి నున్నగ గోళ్ళు గుచ్చుటల్
నోవని యట్లు బాలికిని లోఁబడు ప్రేమికు సంగమంబులన్
ఆవినుతాంగిసైచె మఱియన్యము సైచద ముగ్ధ కావునన్ 9

ప్రొద్దుట నిశా విశేషముల్ గ్రుచ్చి గ్రుచ్చి
యడుగు సఖురాండ్రఁ యాకుతూహలముతీర్చ
జెప్పలేదయ్యెఁ బార్వతి సిగ్గులొలుక
నాతి మది దెల్ప నావేదనంబు పొందె. 10

అద్దమున భోగచిహ్నంబు లామె గనుచు
వచ్చి వెనుకగ నిల్చిన ప్రణయునీడ
నద్దమునఁ జూచి తననీడ లచట గాంచ
సిగ్గు దొలుకాడ నేమేమి చేయదతివ. 11

ప్రియుఁడగు హరుచేత ననుభవింపఁబడిన
యౌవనము మించు సుతఁ జూచి యామె తల్లి
యూరడిలె; వధూజనులు నెయ్యురకుఁ బ్రియుల
యగుటఁ దల్లులహృదిచింత నపనయింత్రు. 12

కొన్ని దినము లిట్టు లెటులో కోమలాంగి
శంకరునితో విహారములు సలుపుచుండి
అల్ల మన్మథరసముల మెల్ల మెల్ల
నెఱిఁగి, కలయిక వగశీలమిఁకఁద్యజించె 13

ప్రియుఁడురమొత్తి కౌఁగిటను బిగ్గరఁజేర్చిన బాఱదామె, ఆ
ప్రియుఁడిటు మోముఁ దామరను వేడిన వెన్కకుఁ దీయ దిమె, ఆ
ప్రియుఁడిక మేఖలన్ దడివి ప్రేమ మెలంగియు జారుచుండినన్
ప్రియ ప్రియుస్వైరహస్తమును వెన్కకుఁ ద్రోయదు నెంతొగట్టిగా. 14

కొలఁది దినాలలోనె పయికుబ్బక లోనె యణంగి యున్న యా
చెలువుర ప్రేమ, భావములచేతను సూచిత మౌచు ప్రియం
బులు గనలేనిదై దృఢత చెంది క్షణంబెడ బాయుకూడనె
ట్టులో నయిపంగలేకయె యెటోయయి యొండొరు నాశ్రయించెఁగా. 15

తనకు సమాన నెయ్యుఁ బ్రియతన్నిటు రంజన చేయఁగోరెనో
తనకు సమాన కాంత ప్రియుఁ డన్నటు రంజనచేసె నెంతయున్
తనకడఁ జేరి వ్యోమనది తన్ జలధిన్ విడిపోద వెన్కపన్
తనయెడఁ జేర్చు నంబుధియు దన్నదినేశరసాత్మఁ జేసెఁగా. 16

కామశాస్త్రోపదేష్ట శంకరుని కొంటె
శిష్యజికము చేసి యుమ యే శిక్ష నేర్చె
అందె గురుని మించిన శిష్య యైదనర్చి
అదియె గురుదక్షిణగ పతి కప్పచెప్పె. 17

కొఱకఁబడి విడిచిన మోవిఁ గోమలాంగి
వ్యథలచేఁ గేలు చివురు నిట్టటు విదిర్చి

చల్లనగు హరుశిరశ్చంద్ర చంద్రికలను
ఒక్కక్షణమె సౌఖ్యము పెట్టుచుండియుండె. 18

ముద్దుగొన, ముంగురుల మార్గములను నుదుటి
కంటఁబడి మెరమెరలాడ కన్ను హరుని
విచ్చు తామరపూలతావిని విడుచు
గౌరి మోముగంధముఁ దెచ్చు గాలికిచ్చె. 19

వ॥ ఇట్లు ఇంద్రియములకు సౌఖ్యము గొలుపు మార్గములు సేవించుటచే మన్మథుని ననుగ్రహించుచు శైలరాజభవనంబున వృషభధ్వజుండు పార్వతితోఁ గూడ నొకనెల దినంబులు మాత్రమే గడపె. పిదప ఆత్మభవుండగు శివుండు స్వతనయా విరహ దుఃఖ కాతురుండగు హిమవంతుని వీడ్కొల్పి స్వేచ్ఛాగతుల విహరించు వృషభంబుతో నందంద విహరించె. ఒకమాఱతండు మేరుగిరికేగి యచట గాలివలె వేగంబుగ సంచరించు వృషభంబుచే తీసికొని పోఁబడి పార్వతి యవయవంబులచే గౌరవింప బడిన స్వైర విహారమర్దనంబులకుఁ దగినవిధంబుగ బంగారు, చివురు జొంపములతో నలంకరింపబడిన పూలపాన్పులందునను గూడి విహరించెను. ఒక్కమారు, పద్మనాభుని చరణంబులచే నంకితములయిన శిలలపై గాలి అమృతంపు గ్రొత్త నీటితుంపురులను జిలుకుచుండ, పార్వతి మోము తామర పువ్వులోని మరందములను బాగుగాను గంటుతుమ్మెదయై శంకరుండు మందరగిరిచరియల సంచారములు చేసెను.

ఒకపరిఁ గైలాస శిఖరంబెక్కి జగద్గురుండగు శంకరుండు రావణుని సింహనాదంబునకు భయందికంఠంబుపైన వైచి దృఢంబుగా బాహువులచే కౌగిలింప శశిప్రభకల స్వచ్ఛమై శరద్రాత్రులను గడపెను.

ఒకసారి మలయ పర్వతంబునఁ గ్రీడించుచుండఁ జందనంపుఁ దీవియల నల్లాడించుచు అనంగకేసరంబుల నుండి వీచుచుఁ జాటుకారునివలె మలయానిలుండు ప్రియురాలగు గిరిజ శ్రమజలములను పోగొట్టి సుఖపెట్టెను.

ఒక్కమాఱు జలక్రీడలందేలుచు ఆ క్రీడలోఁ బ్రియుని బంగారు తామర పూవ్వుతో నామె కొట్టగా, ఆ ప్రియుడు మరల నీళ్ళు ఆమె కళ్ళపై

జల్లినఁ గండ్లుమూసికొనుచు చేపలబాఱు ఆమె ముత్యాల మొలనూలును రెండు వేల మొలనూలింగాఁ జేయనదిలో మునకలాడెను.

శచీదేవి ముంగురులకుఁ దగిన పారిజాత కుసుమంబులచే నందన వనంబున నామె ముంగురులను శంకరుం డలంకరించుచుండ నిస్పృహగా దేవతాకన్యలు వీక్షించిరి.

ఇట్లు దయితతో శంకరుండు స్వర్గభవంబులు, భోగంబులనగు భోగంబు లనుభవించుచుండ నొకనాడు సూర్యుండు సాయంసమయమునఁ జేగు రురంగుకలవాడగు సమయంబున గంధమాదన పర్వతంబును సమీపించి యందలి బంగారు శిలాతలమునఁ గూర్చుండి కంటికిఁ గనిపించు భాస్కరు నవలోకించి తన యెడమవైపుగఁ గూర్చుండియున్న స్వర్ణవర్ణచారిణియగు పార్వతితో నిట్లనెను.

తుదల నెఱుపుఁ జారలు మూఁడు పొదలుచుండు
నీ కనుల బోలెఁ బద్మకాంతిని నిమిడ్చి
ప్రళయమున బ్రహ్మ జగమును బఱెను బ్రియురాల
సవిత యిదిగో దినము నుపసంహరించు. 20

సూర్యుడస్తమించి తన యంశువులచేత
నుదక కణముల బంధ ముడుగఁ జేయ
సి జనకుచుట్టు వలగొను నిర్ఝరములు
ఇంద్రధనుసుల పరివేషహీనములగు. 21

తామరపువు కింజల్కాల దండగొబకు
చక్రవాక పక్షులు పరస్పర మథన
మయియుఁ జీకట్ల గంత్రములవలిపోటు
వ్యథల నణఁచు, వాటికి దూర మధికమయ్యె. 22

ఏనుఁగులు దినంబంత చరించి యలసి
యందుగు చివుళ్ళు ముక్కల గంధమలము
మేలి పద్మాల కంటు తుమ్మెదలు ముసరి
యెవరు జలమాను నుదయాద్రిక్షేత్రమునకు. 23

మాహాత్మ్యమును గూర్చి పలికి మఱియు నింకను శంకరుండు ఇట్లు పార్వతితో ప్రేమ సరససల్లాపంబు లాడుచు నందందు విహరించుచుండ దినంబులు నిమేషంబులు సమప్రమాణంబు లయి నూటయొక్క ఋతువులు గడచెను. అయినను నిత్యము సముద్రమునందుండి జలపానంబు చేసియు బడబాగ్ని తృప్తిని పొందనట్లు- శంకరుండు తృప్తి పొందడయ్యె.

ఇది

ఎనిమిదవ సర్గము

—(౦)—

* ఇంతవఱకు యథామూలముగను ఇక్కడనుండి సంగ్రహముగ కథా సందర్భౌచిత్యములను పాటించియు అనువదింపబడినది. దీని తరువాతఁ గూడ, పూర్తిగాఁ గాళిదాసు కవిత్వముగూడఁ గాదనియు నెవరో కాళిదాసు పేరుతోఁ బూర్తి చేసిరనియుఁ గనుకనే తొమ్మిదవ సర్గనుండి మల్లినాథుని వ్యాఖ్య దొరకలేదనియు నందురు.

# కుమారస్వామి జయము

## తొమ్మిదవ సర్గము

### కుమారస్వామి జననము

అంత నొకనాఁడు ఉమామహేశ్వరులు కేళీవినోదంబుల నుండ లోని మందిరమును ఒకపావురము ప్రవేశించి కూయుచు మండలంబులుగఁ దిరుగు చుండుటగని సర్వాంతర్యామియు నూర్ధ్వరేతస్కుఁడు నగు హరుండు దాని దివ్య దేహమును చూచి కపోతవేషంబు ధరించిన యగ్నిగా గ్రహించి క్రోధంబున ముఖము చిట్లింపఁగని యగ్నిహోత్రుండు మిగుల వణంకుచు స్మరారితో నిట్లనియె.

ఈ వొకండవె లోకాలకీశ్వరుఁడవు
ఈ వసురల బాధల నణియింపఁజేతు
వందుచే రాక్షసులచే భయంబుచెంది
యింద్రుఁడాదిగ నిన్నుపాసింతు రెపుడు 1

నీవు ప్రియురాలితోఁగూడి యెసఁగుచుండ
నింక నూఱు ఋతువులు గతించి పోయె
అందుచే నిన్నుఁ జూడ దేవేంద్రుఁడాదు
లార్తులై వచ్చి యున్నారలయ్య దేవ 2

ఓ ప్రభూ! యనుగ్రహించియ యొక్కసుతుని
గనుమి నీదయ నతఁడు రక్షణము చేయు
ననుచు వగ విన్నవించెడి యగ్నిమాట
విని హరుఁడు ప్రసన్నత సుతుని గనఁ దలంచె. 3

ఊర్ధ్వరేతస్కుఁడౌ హరుం డొగినిసైచ
కానిదైన స్వశక్తి హిరణ్యరేతుఁ
డగ్ని యందుంచె నంత నాయగ్నికూడ
ఎంతొ జాగ్రత లోన రక్షించె దాని 4

అట్లు మధ్యాగ్ని వచ్చిన యగ్నిఁ జూచి
ఆత్మ యానందమును భగ్న మౌట గిరిజ
సర్వ భక్షకుఁడవై భీమచర్య గలిగి
కుష్ఠ రోగివై పొగలను గొన శపించె 5

వ. అట్లులలిగిన పార్వతినిజూచి శంకరుం డాయాయి సల్లాపంబుల నామె కోపంబు శాంతిల నొడాల్చెను. అంత వీతిహోత్రుండును ఆ శంకరునిశక్తి భరింపఁజాలక యింద్రుఁడు చెప్పఁగా సర్వతాపముల హరించు గంగయందు తన తాపంబు శాంతింప మునకలాడె. అపుడా శంకరుని యమోఘ వీర్యంబు సకలపావనియగు గంగలో సంక్రమించెను. అపుడా గంగయును దానిని భరింపఁజాలకపోయె. అంత మాఘమాసంబున తనలో స్నానమాడ వచ్చిన దక్షతనూజలు కృత్తికలు జలముల మునకలాడుచుండ ఆ యమోఘ వీర్యంబు వారియందుఁ బ్రవేశించెను. వారును గర్భరూపంబు దాల్చిన యా యమోఘశక్తిని రెల్లువనమందుంచి తమతమ యిండ్లకేగిరి. అపు డాగర్భము సూర్యబింబమట్లు తేజస్వియై యారుముఖములుగలదై షాణ్మాతురుండన షణ్ముఖుండనఁ బరగి చతుర్ముఖునిగూడ నతిశయించి వెలింగె.

అపుడు దేవేంద్రాది దేవతల ప్రార్థనచే గంగామతల్లి స్త్రీరూపము దాల్చి తన యమృతధారలచే షణ్ముఖుండగు కుమారుని పోషించెను. పిదప భాగీరథీపావకులును కృత్తికలార్గురునువచ్చి వీఁడు నా కొమరుడని యెవరికి వారే వివదింపసాగిరి. ఆకాశయానంబున శంకరునితో విహరించు గిరిజ ఇదిచూచి శంకరునివలన జగత్ప్రియానందకరుఁడైన యా కొమారుని తన కుమారునిగఁ దెలిసికొనివచ్చి ముద్దులుగురిపించి లాలించెను.

అట్లు ఆ కుమారుఁడు ఇందఱుతల్లులకుఁ గుమారుఁడై కుమారుఁడను పేరుగలవాఁడయ్యె. అపుడు సకలలోకంబులు ఉత్సవంబులుచేసిరి. అచ్యుత

లాడిరి. దివ్యదుందుభులు మ్రోగె, గాలి చక్కగా వీచెను. దీనివల్ల తారకా సురునిలక్ష్మి వణంకిపోయెను.

అపుడా కుమారుండు దినదిన ప్రవర్ధమానుండయి ఓంకారము మొదలు కొని అక్షరములునేర్చి క్రమంబున సర్వవిద్యలునేర్చెను. యువకుండయి ధనుర్వేదంబున నిష్ణాతుడై ఎదురులేని వీరుండయ్యెను. ఇట్లు మహావీరుం డయిన కుమారునిజూచి పార్వతీ పరమేశ్వరులు మురిసిపోయి దీవెనలిడిరి. దేవేంద్రాదులు సంతసిల్లిరి, తల్లులైన కృత్తికలు పార్వతియు అమోఘా శీస్సులిడిరి.

అంత దేవతలా మహావీరుండగు కుమారుని తమకు సేనాధిపతిగ నభి షేకించి తారకాసురుని బారినుండి రక్షింపవేడిరి, పిమ్మట ఆ కుమారస్వామి దేవతలు జయవెట్టుచుండ తల్లిదండ్రుల యనుమతి గైకొని తారకాసురుని జయింప నడచుటయు నాతారకుండును మహాభయంకర యుద్ధమునకు సన్నద్ధుం డయి తన యపార సేనలతో దేవసేనలనెదుర్కొనె నంతట దేవాసురులకు ఘోరమగు యుద్ధమయ్యె. ఇందు

## తారకాసుర-కుమారస్వాముల యుద్ధము

పథిని గాల్బంటుఁ గాల్బంటు, రథికు రథికుఁ
దశ్వ సైనికుఁడశ్వ సైన్యాధి పతిని
హస్తి సైనికుఁడంతట హస్తిభటుని
దాఁకని రణము సమప్రతిద్వంద్వయయ్యె. 6

తూర్యనాదాలలో ననిర్ధార్య వాక్కు
లయ్యె దేవాసురుల్ స్వనామాదికము
నపుడు చెప్పరు కాని బాణాక్షరములె
యొండొరుల ఖ్యాత నామంబులొగిని దెలుపు 7

ఆజిలో గుఱ్ఱములు లేపినట్టి ధూళి
రథ సమూహ చక్రంబుల నధిక మగుచు
ద్విరద కర్ణతాళాంచే విస్తరించి
యవల గ్రమముగ సూర్యుని నడ్డగించె 8

గాలికిన్ నోరు తెఱచిన మీల ధ్వజము
లోలిఁ బెరిగిన సైన్యాల ధూళిగ్రోల
నిజవు మీలు క్రొత్తబురద నీరు మిగులఁ
ద్రావుచున్నవో యనునట్లు దనరుచుండె 9

రథము రథచక్రముల ధ్వనిన్ బ్రకటమయ్యె
కదలు గంటలచేతను గజము తెలిసె
స్వప్రభువుల నామంబులులు పలుకుచుంట
స్వపరపక్షాల్ తెలిసె రజస్సాంద్రభువుల 10

తనుల మార్గలంబునడ్డి యాకదన భూమిఁ
గడు విజృంభించిన రజోంధకారములకు
శస్త్రములతెగు నశ్వ గజప్రవీర
శోణిత ప్రవాహము బాలసూర్యుఁడయ్యె. 11

రక్తతతిచేత తెగిన మూలంబు దగ్గి
రక్తతతిపైని గాలిచేఁ బ్రహతమగుచు
బొగ్గులై మిగులు నగ్నికి ముందుగానె
వెడలు ధూమంబు పోలికఁ గడువెలింగె. 12

అస్త్రహతి మూర్ఛలు రథికు లవలలేచి
చూచి గుఱ్ఱాల మరలించు సూతుఁదిట్టి
తమ్ముఁగొట్టిన వారిని తద్ధ్వజాలఁ
బట్టిగుర్తించి యల్కతోఁ గొట్టిరపుడు 13

కర కుశలత కలుగు ధనుర్ధరులు శరము
లరుల శరములచే మార్గమధ్యమునఁ దెగియు
ప్రకట లోహపూర్వాపు నగభాగశిఖలఁ
దమకుఁగల వేగమున లక్ష్యతతినె పొందు 14

వాడి చక్రాయుధాల మావటుల తలలు
గజరణంబులఁ దెగియుడేగలన ఖాల
సూదికొనలఁ దగులుకొనుజుట్టు కలిగి
చాల సేపటికిని రణస్థలిని బడియె. 15

ప్రథమమునఁ గొట్టు గుజ్జపు రౌతు తిరిగి
తన్నుఁ గొట్టలేక కళ్ళెంపు స్కంధమున నున్న
వైరిభటు మదికొట్టగ వాఁడు మరల
బ్రతికి హాయిగ సౌఖ్యంబుల బడయఁ గలిగె 16

బాణములఁ దెగు తల లనుఫలము లమరి
పడు శిరస్త్రాలనెడి పానపాత్రలొప్ప
రక్తమను మద్యపుఁ బెను కాల్వలు స్రవింపఁ
గ్రాలె రణభూమి యముపాన శాలవోలె 17

ఒకఁడు తనతలన్ రిపుఖడ్గమూడగొట్ట
మరుక్షణమె దేవతయయి విమాన మెక్కి
ఎడమవై పచ్చరలు కౌఁగిలించు కొనఁగ
నాజిలోఁదన మొండెమల్లాడఁగనియె. 18

ఒకరొకరి సూతులంజంప నొక్కరొకరె
వారె సూతులై రథికులై పరఁగి రపుడు
గుజ్జములఁ జంప గదలతోఁ గొట్టుకొనిరి
కత్తి విఱుగ బాహాబాహి మొత్తుకొనిరి 19

ఒకరొకరిఁ జంపుకొని వచ్చి యొక్కరొక్కరె
దేవతా భావమొందియ దివ్యభువుల
నొక్క యప్సరసనె కోరి యొక్కరొకరు
వాదములఁ గొట్టుకొనసాగి పడుదురపుడు 20

గొప్ప వ్యూహములవి వరస్పరము రెండు
నియమమే లేకయ జయాపజయము లొందె

వెనుక ముందులఁ బవనంబు వీవ పరుస
నబ్ధి వీచులాటుకు పోటును నందునట్లు  **21**

అసురులన్ సైన్యము విఱిగి సప్పటికిని
గొప్ప యోజస్వియుఁ గుమారుఁడప్పు డసుర
సేనలను జొచ్చెఁ బొగగాలిచేత మరలు
నగ్నియో గడ్డి యెటనుండునటకె యేగు।  **22**

రథికుఁడై యమ్ముపొది తనుత్రాణమున్న
తారకుం డొక్కరుండు మత్తుఁడై దాకె సురల
ప్రళయకాలాన నుప్పొంగు వార్ధిజలము
లా మహా వరాహము వోలె నడ్డగించె।  **23**

## తారకాసురవధ—కుమారస్వామి జయము

వ॥ ఇట్లు ఘోర యుద్ధము జరుగుచుండ దేవవైరియగు తారకుండు వికటాట్టహాసంబు చేసి దేవేంద్ర ప్రముఖామరుల మీద విఱిగిపడి వారందఱపై బీభత్సముగా రాళ్లచే భూధరమట్లు శరవర్షము కురిపింప అంతభీతిల్లి దేవతలు స్మరారి కుమారుండగు కుమారుం జేరఁ గుమారుండు లీలగా నవ్వి యడలకుఁడని వాయవ్యాస్త్రంబు వేయ, తారకుండు నాగాస్త్రమేసె అంత నాగంబులు భూనభంబుల వ్యాపించి ముట్టుకొన వెంటనే కుమారుండు గారుడాస్త్రమును ప్రయోగించ నాగములెక్కడివక్కడ మాయమయ్యె, అంత తారకుఁడాగ్నేయాస్త్రమువేసి ప్రచండ ప్రళయకాలంబట్లుచేసి వేయఁగాంచి కుమారుండు వార్షుకాస్త్రమునువేసెనంత నామంటలన్నియుఁ జల్లఁబడిపోయె, అవల తారక కుమారులొండొరుల నధిక్షేపించుకొనుచుఁ గొంతవడి భీకర సమరనైపుణ్యంబు చూపిరి. అపుడు దైత్యుండు తారకుండు "ఇదిగో నీవింక నుండవు ఇపుడు నీవో నేనో లేకపోవలె. ఇంక ప్రపంచము అకుమారమో అతారకమో యగుఁగాక" యనుచు కుమారుమీఁద విజృంభించి పడఁగ నింక నాలసించుట మంచిదికాదని కుమారుండు యుగాంత కాలాగ్నినింబోలు మహాశక్తిని ఆ మహాసురుండగు తారకుని హృదయంబుపైని ప్రయోగించి చిరకాలంబునుండి బాధలుపెట్టు తారకుని దుష్టకార్యంబులనుండి విముక్తిని

గలిగింప నచిరకాలంబులో దేవతలు ఆనంద కందళితాంతరంగులుకాఁగా నా తారకుడు శాశ్వతముగ యోగనిద్రంబోలిన నిద్రనుబొంది భూమాత యొడి నాశ్రయించునట్లు గావించెను.

అంత సురదుందుభులు మ్రోగె, నమరతరులు
అలరులనుగుర్సె నప్పుర లాడిపాడి
రమరగణ జయోదాహరణములు వెలసె
మీఱి గంధర్వగేయాలు మారుమ్రోగె. 24

పార్వతీ పరమేశ్వరుల్ స్వాత్మజాతు
దేహమును నిమిరిరి; బ్రహ్మ దీవనలిడె;
విష్ణువు నభినందించె; దేవేంద్రుఁడెరగె
చేరిసురలు జై జై ధ్వనుల్ చేసిరెలమి. 25

రణరంగంబులఁ బండితుండగు కుమారస్వామి యా రాక్షస
వ్రణమున్ మాన్పఁగ దేవతాధిపతియున్ స్వర్గాధిపత్యంబు స
ద్గణ మాన్యంబుగ స్వీకరించి, బుధమూర్ధన్య రత్నావళీ
ఘృణి నీరాజనముల్ వెలుంగఁ బరిపాలించెన్ దివిన్ గ్రమ్మఱన్. 26

ఇది

కాళిదాస మహాకవి రచితమై
వెంకమాంబా నారాయణశాస్త్రుల తనయుండగు
చర్ల గణపతిశాస్త్రిచే ననువదింపఁబడిన
కుమార (సంభవ) విజయము
అనెడి మహాకావ్యమున
తొమ్మిదవ సర్గము
సర్వము సమాప్తము
ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః

——:o:——